శ్రీరస్తు.

# కుశలవనాటకము

విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వర విరచితము.

ఏలూరు

960

మంజువాణీ ముద్రాక్షరశాల.

1913



వెల 0-12 0.

# పీఠిక.

బెజవాడ హిందూనాటక సమాజమువారు మద్విరచితంబగు సారంగధర నాటకంబును బహువత్సరంబులయందనేక వారంబులు ప్రదర్శించుటచేత నానాటకంబునకుఁ దోడుగ నేదియైన వ్రాయవల యునని నాకభిలాషజనియింప నీకుశలవనాటకంబును వ్రాసి వారికినొసంగ నత్యద్భుతంబుగఁ బ్రదర్శించిరి. నాటకసమాజకుల నైపుణ్యమువలన నేమి రామకథాగౌరవంబువలన నేమి నామిత్రులును జగన్నాథపురాగ్రహారం దారులునగు బ్రహ్మశ్రీ శిష్టా జానకిరామశాస్త్రి గారికి దీనియందభిమానము కలుగుటచేత ముద్రాపణంబునకగు స్వపతేయంబు నాకొసంగిరి. కావునవారికిని, నొక్కవారంబులోపల ముద్రింపించి గ్రంథమువిప్పించిన మ. రా. శ్రీ దాసు కేశవరావుపంతులువారికిని గృతజ్ఞుండను. గ్రంథస్వామిత్వంబులను మన్నింపవలసిషుల ను శిష్యప్రశిష్యుండనై ప్రార్థించెద. ఆంధ్రదేశంబునందలి నాటకసమాజికులు సారంగధర నాటకంబునందువలె నీరూపకంబునం దభిమానముంచి ప్రదర్శింప వేఁడుచున్నాఁడ.

11—8—13,
ఏలూరు.

ఇట్లు విధేయుఁడు,
విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వరం.

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు.

| పురుషులు. | | | ప్రవేశము. | |
|---|---|---|---|---|
| రాముఁడు | ... | ... | 1—3—5—6 | అంకము. |
| లక్ష్మణుఁడు | ... | ... | 1—2—3—6 | ,, |
| భరతుఁడు | ... | ... | 1—3—5—6 | ,, |
| శత్రుఘ్నుఁడు | ... | ... | 1—3—6 | ,, |
| వాల్మీకి | ... | ... | 2—6 | |
| వసిష్ఠుఁడు | ... | ... | 3—5—6 | |
| విశ్వామిత్రుఁడు | ... | ... | 3 | |
| నారదుఁడు | ... | ... | 3 | |
| నిమి | (ఒకమునితనయుఁడు) | | 4—6 | |
| అమరకుఁడు | . | ... | 5 | |
| కుశుఁడు | ... | ... | 4—6 | |
| లవుఁడు | ... | ... | 6 | |
| స్త్రీలు. | | | | |
| సీత | ... | ... | 2—4—6 | |

## ప్రదర్శకుల కొఱకవిజ్ఞాపన.

ప్రథమాంకమునందు మొట్టమొదట చాకితచాకలుల ప్రవేశము ద్వితీయాంకమునందు గంగనతిక్రమించునపుడు పడవవాండ్రప్రవేశము మూడవయంకముతుద వాల్మీకిపాఠశాలయందుఁ గుశలవుల ప్రవేశముఁ జూపవలయును. ఏదో యొకగుఱ్ఱము వచ్చినదనియు దానినిబట్టుకొందమనియుఁ జెప్పి యొక్కబడిబాలుని లవుఁడు తీసికొనిపోవునట్లు చేయవలయును. పిదప నాలవయంకము ప్రారంభింపవలయును. ఆఱవయంకముచివరఁ గుశలవులకుఁ బట్టాభిషేకముఁ జూపవలెను.

## విక్రయమునకు సిద్ధముగానున్న గ్రంథములు.

———:o:———

1. సారంగధరనాటకము. ఇది యేడంకములనాటకము. 128 పుటలు శృంగార కరుణరసములకుఁ బుట్టినిల్లు. పఠనమునకుఁ బ్రదర్శనమునకు యోగ్యము. రసవంతము. లక్షణయుక్తము.
వెల రు 0—12—0.

2. కుశలవనాటకము—ఇది యాఱంకములనాటకము. రసప్రధానము. భగవత్కథ. కుశలవులసంభాషణ మతిశ్రావ్యము. ప్రదర్శనమునకు రక్తిగానుండును. వెల రు 0—12—0.

3. ప్రహ్లాదనాటకము—ఇది యేడంకములనాటకము. భక్తిప్రధానము. ప్రతిపద్యము రసాస్పదము. హిరణ్యకశిప నారసింహులసంభాషణ మతివినోదము. వెల రు 0—12—0.

4. రమ్యసాంబవిలాసము—శృంగారరసప్రధానము. మృదుమధురపదభూయిష్ఠము. సర్వజనామోదము. వెల రు 0-8-0

5. దుర్మార్గచరిత్ర—హాస్యపద్యప్రబంధము. ప్రతిపద్యమునకు నవ్వువచ్చును. వెల రు 0—4—0.

6. సుందరి—వచనకావ్యము. నీతిదాయకము. ఇదిచదివిన వ్యభిచారవృత్తి నశించును. వెల రు 0—4—0.

శ్రీరస్తు.

# కుశలవనాటకము.

(నాంది)

చ. పరహితధుర్యులన్ గుశలవప్రతిమానమనీషులన్ యశ
స్సాగరులఁ బరేంగితజ్ఞుల నసాధ్యతపఃప్రథితానుభావులన్
గురువులఁ బండితోత్తములఁ గోవిదమాన్యుల రామనామత
త్పరులఁ బరాత్పరాఖ్యుల నపారుల ధీరుల సన్నుతించెదన్.

సూత్రి— మారిషా! ఇటు రమ్ము.

మారి— (ప్రవేశించి) ఏమిసెలవు?

సూత్ర— నిన్నటి సభ్యుల ప్రశ్నమును నీవు వింటివా?

మారి— వినకేమి? పరాపవాదమునకై యాత్మనేనిఁ బరిత్యజింపఁదగు యోగ్యుఁ డెవ్వఁ డనియే కదా?

సూత్ర— అవును. అట్టియనఘాత్ముఁ డెవ్వఁడై యుండునో.

మారి— (స్మృతి నభినయించి) ఇఁక నెవ్వరు? మనశ్రీరాముఁడే. అతఁడు పరాపవాదకై భార్యను ద్యజించెఁగదా?

సూత్ర— ఆత్మను ద్యజింపలేదు గదా.

మారి— "అర్ధోవాఏషఆత్మన" యను శ్రుతిచొప్పున భార్యా పరిత్యాగ మాత్మపరిత్యాగమే?

సూత్ర— (సంతోషముతో) బాగు బాగు. చక్కఁగా సమర్థించితివి. అట్లయిన నీనాఁడు మనమాయనఘుని చరిత్రమును ప్రదర్శించిన నిన్నటిప్రశ్నమునకు నుత్తరమిచ్చిన వారమగుదుము.

మారి— ఆర్యా! ఆనాటకకర్త యెవ్వరు?

సూత్ర— శా. బ్రహ్మణ్యుండన వాసికెక్కి నిగమవ్యాహారసంప్రీతి నా
బ్రహ్మన్నాదను విష్ణుభట్లకులవిద్వద్భృజ్ఞ నారాయణ

బ్రహ్మజ్ఞానికి రాజమాంబకును గారాబంపుఁ బుత్రికకు సు
బ్రహ్మణ్యేశ్వర నామధేయుఁ డొగినీగ్రంథంబు నిర్మించెఁ దాన్.

మారి—రాముఁ డంతప్రాజ్ఞుండు గదా! నిరాపనిందకై భార్య నెట్లు పరిత్యజించెనో?

సూత్ర—తే. గీ. కాలవశమునఁ బ్రాజ్ఞుండు కలఁగి యజ్ఞుఁ
డగును నజ్ఞుండు ప్రాజ్ఞుండు నగును దాన
లేకయుండిన వహ్నిని దాఁకి శుద్ధ
మైన బంగారమునకెది యర్ఘ్యమగునె.

ఇంతకు నయ్యనఘుఁ డామె పరిశుద్ధయని యెఱిఁగియే లోకారాధనమ్మునకయి యట్లొనరించియుండును.

(తెఱలో) మేలు మేలు. కుశీలవా! నీయూహ కడుఁ జక్కఁగనే యున్నది, నాయభిప్రాయ మదియే.

మారి—(వినుట నభినయించి) ముందుగనే కుశలవుల పేరు వినవచ్చుచున్నది. ప్రథమపాత్రములే యవియా యేమి?

సూత్ర—(నవ్వి) నీకు నానాఁటికిఁ బాండిత్యము వృద్ధియగుచున్నదే ఇందుఁ గుశలవప్రశంస యేమియున్నది? కుశీలవాయని శ్రీరామభూమికను ధరించిన మాయన్నగారు నన్నుఁ గూర్చి సంబోధించెను. కుశలవప్రసంశ నాలవయంకము దనుక నిందు రాదు. మన మనంతర కరణీయమ్మునకుఁ ద్వరపడుదము. (నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

---

శ్రీరస్తు.

# కుశలవనాటకము

## ప్రథమాంకము.

సభాభవనము.

(రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు ప్రవేశించుచున్నారు.)

రాము—తమ్ములారా!

తే. గీ. యశము వీడి పక్వాన్నంబు లారగించి
హంసతూలిక తల్పంబు నందుఁ బండి
యుంటకంటె యశముగల్గి యింటనింట
మధుకరంబుకై తిరుగుచు మనుట మేలు.

లక్ష్మ—సత్యము. అట్లు కాదనువారెవ్వరు? అనిన లాభమేమి?

రాము—సోదరులారా!

చ. ఇనకులదుగ్ధవార్ధి నుదయించి కకుత్స్థ భగీరథాది భూ
పనుతచరిత్రముల్ వినియుఁ బఙ్క్తిరథాత్మజులయ్యు దుర్యశం
బును గనినార మేరిఁ గన మోముఁ కఁ జెల్లదు సాటివారిలో
మనతల లిట్లువంచుకొని మానము లేక మనంగనయ్యెఁగా.

లక్ష్మ—అట్లు తలవంచుకొనుటకు మనమేమి యకార్యకరణం బొనరించితిమి?

రాము—ఇంతకన్న వేఱేకావలయునా?

లక్ష్మ—దేనికన్న.

రాము—తమ్ముఁడా! లక్ష్మణా!

చ. జనకజ సాధ్వియంచు సురసంఘము లాడఁగ దుష్టరావణున్
దునిమినకారణంబున నుతుల్ సలుపం గని రిచ్చకంబుకై
యని మదినెంచఁగా జనకుఁ డర్మిలివచ్చి కుమార యేలుమీ
వనితను సాధ్వి సాధ్వి యనిపల్కఁగ నమ్మితిఁగాదె తమ్ముఁడా.

లక్ష్మ—నమ్మితిరి. అందుఁ దప్పేమియున్నది?

రాము—పరదారాపహరణ పరాయణుండగు రావణుండు లంకలో నొక్కయేఁడుంచిన సీతను రోతలేక మనయేలిక యేలుకొనుచున్నాఁడు—(అర్ధోక్తిలో)

లక్ష్మ—(కోపముతో)

చ. ఎవఁడవురా దురాత్మ సతి నీగతిఁ గూఁతలు కూసినావిసీ
జవమునఁ గుత్తుకంట నతిసాహసవృత్తినిఁ గోతుఁ బూజ్యుఁడీ
రవికులుఁ డడ్డమై నను మరల్చిన నీయసియైనఁ జంపకుం
డవిడుచునే దయన్గొనునె న్యాయమునుదప్పినఁ బ్రాణముండునే.

శత్రు—(కోపముతో)

మ. అవనీజాతను దుర్మదాంధుఁడయి యేయజ్ఞుండు వాక్రుచ్చెనా
యవినీతున్ బరిమార్తుఁ గ్రోధశిఖి సప్తాంభోధులింకింతు వా
గ్ధవుశీర్షంబును బట్టి తెత్తుఁ గనకగాత్రంబు నుగ్గంబుగా
నవలన్ద్రోతు సమస్తలోకముల సంహారంబు గావించెదన్.

భర—(కోపముతో) ఓరోరీ దుర్మార్గులారా! యుక్తాయుక్త విచారశూన్యులారా! పూతచారిత్రవిఖ్యాతియు లోకంబులకెల్ల మాతయు విశేషించి మాయగ్రజున కర్ధాంగియైన సీతామహాదేవిని సామాన్య వనితగాఁ దలంచి నోటికివచ్చినట్లు వాగితిరా? మీకుఁగాలంబాసన్నంబైయున్నది కాఁబోలు? "వినాశకాలే విపరీతబుద్ధి" యను సూక్తిరిక్తయగునా?

లక్ష్మ- మ. జనకక్ష్మాధవపుత్త్రి తేజుగతి నేచంధాలుఁ డేదుష్టుఁ డా
డెనో యాదుర్మతి మత్కృపాణమున ఖండింతున్ బృహద్భానుజ్వా
లనికాయంబున వ్రేల్చెదన్ జలధి వెళ్ళన్ ముంచెదన్ లేనిచో
జనితక్రోధకృశానుకీలతతులన్ శాంతించు సౌమిత్రికిన్.

రాము—తమ్ములారా! ఈయకాల నిర్నిమిత్తాగ్రహంబేటికి? నేను జెప్పు వాక్యంబును సమాహిత చిత్తులరై యాలకింపుఁడు.

భర—ఏమి చెప్పనుంటిరో యనియాంతయము సెలవిండు.

రాము—అని పలువురు పలు తెఱంగుల మనపారు లాడుకొనుచున్నారు కావున నెట్లైన సీతను పరిత్యజించి మత్పూర్వార్జిత యశశ్చంద్రికను గాపాడుకొనవలయును.

ఉ. జానకిఁ బాయకుండిన యశంబుదొలంగు యశంబుపోవ నీ
ప్రాణములేల కావున రయంబున నీవగ పేది కాంతనున్
గానను డించి మీయనుజ గౌరవము న్వెలయింపుమయ్య నా
మానము నీదసుమ్మ వినుమా ప్రియసోదర కైకనందనా.

భర— మ. గిరులన్ లీలఁగ బంతులాడెదను వేఁగిలిన్ ప్రవేశించెదన్
శరధిన్ బుక్కిటఁబట్టెదన్ రయమునన్ శార్దూలమున్ దెత్తునం
బరమున్ జేతులఁద్రోసెద న్గరముయుష్మచ్ఛాసనంబైన సో
దర! మాయమ్మను డింపఁజాల వని నీతమ్ముండ నేఁగానొకో.

మీకుఁ దమ్ముఁడనయ్యు దురితకృత్యంబునకుఁ బాల్పడుదునా? అది యటుండనీ.

డు. అవధరింపుడు.

చం. జనకజ మిషమ్ము లక్ష్మణు విచారము మాని యరణ్యసీమకున్
బనిపినకైకకున్ సుతుఁడు పాతకుఁడీభరతుండటంచుఁ బొం
దినసడి చాలదే మరల దేవిని నీమిషఁ గానకొంటిగాఁ
గొనిచనెనన్న యీకొలను గూడను నామెడకేలకట్టగన్.

రాము—(తనలో) ఈభరతుఁడు వదినెగారియందలి ప్రేమచేత నావచనంబు నతిక్రమించుచున్నాడు. ఈకార్యంబునందు శత్రుఘ్నుని నియోగించెదనుగాక. అతఁడేరీతి నుత్తరంబొసంగునో (ప్రకాశముగా) అనుజా! శత్రుఘ్నా! బలవంతుడవయ్యు మున్నెన్నఁడు గురువుల యాజ్ఞను మీఱినవాఁడవుకావు. పురుషున కపయశంబు తగదని తెలియనివాఁడవుకావు. నీకువిశేషించి చెప్పవలసినపనిలేదు. పుడమిపట్టిఁగొని నట్టయడవులలోఁ బెట్టిరమ్ము గురుకార్య నిర్వహణభారవాహుండవు కమ్ము. రయమ్మున తెమ్ము. పొమ్ము.

శత్రు—అగ్రజా! ఎప్పటికిఁ దమశాసనంబును దప్పువారముకాము కాని మాప్రార్థనఁ గూడ నొక్కింత దయాంతరంగులరై యాలకింపుఁడు. తప్పుమన్నింపుఁడు.

చ. అడవుల కేఁగు పోవుతఱి నారసి సన్గొని పొందఁటంచు మి
మ్మడుగఁగ గీడు మూఁడు వలదంచు హితంబు వచించియుంటిరే
పడఁతికొ యాపదంతుకనె భావమునన్ దయఁబూనకొంటిగా
నడవిని డింపఁజెల్లదని యాత్మనునైన నెఱుంగకుంటిరే?

అట్టులెఱింగియు నెవ్వరో నీచులాడిన పలుకుల కింత యలుకయేల? క్షమింపుము కోపమును శమింపఁజేయుఁడు.

రాము—(తనలో) పిన్నవాఁడైనను శత్రుఘ్నుఁడు నాయాజ్ఞమీఱకట్లు మీఱుచున్నాఁడు. ప్రళయకాలభైరవునింబోలె విశేష రోషభీషణుండైనను లక్ష్మణ మత్తవారణంబు మదాజ్ఞాంకుశంబువలన శాంతినొంది యీకార్యంబు నెరవేర్పవలయును. (ప్రకాశముగా) తమ్ముఁడా! లక్ష్మణా! మాయమృగములను గొలిచి యడవులందుఁ బడరానియిడుమల బడలితివి. నాకనుసన్నకర్జంబున కెన్నఁడైనను గడంగుదువు. నాయభ్యుదయంబే నీయభ్యుదయంబని సంతసింతువు. అట్టినీవే నాహితంబును జూడ నిచో నింక దిక్కెవ్వరు? కాన జానకియందలి ప్రేమ వీడి క్రూరహర్యక్ష గోభక్తరతము ప్రముఖసత్త్వశరణ్యంబైన యరణ్యంబున డించి రమ్ము.

లక్ష్మ—మ. ధరణీజాతను సీతఁ బూతచరితన్ దంతావళవ్యాఘ్రకో
సరిభల్లూక యుతాటవిన్విడిచి కౌసల్యాంబవక్త్రంబు నే
కరణిన్ జూచెదఁ జూచి యీకఠినవాక్యం బెట్లుభాషింతు ని
ద్ధర మీసోదరులట్టి దుష్టజనులే తామెన్ని నట్లారయన్.

అగ్రజన్మా! రఘుకులవంశాభరణా!

చ. పరులకు మంచిచెడ్డలను బల్కఁగఁజాలిన యట్టిమీకు నే
కరణినిఁజెప్పఁజాలుదును గాని స్వకార్యమునందు మేలు దె
ప్పరములు గోచరంబగుట ప్రాజ్ఞులకైనను దుర్లభంబు భా
స్కరకులదీప! కాన ననుజన్ముఁడు చెప్పెడుతప్పు సైఁపుఁడీ.

ఉ. ఏయమకై యరణ్యముల నెల్లను గ్రుమ్మరి డస్సినారమో
యేయమకై సముద్రమున కెంతయు సేతువుఁ గట్టినారమో
యేయమకై దశాస్యుని సుతేష్టులతోడ వధించినారమో
యాయమ నే వనంబులకు నంపఁ బ్రశుద్ధిగఁ గూడ దగ్రజా.

ఎవ్వరో విచారదూరులై పౌరు లూరక దూరుచున్నారని వ్యాకులపడనేల? తొంటిచందంబును మఱచితిరి కాఁబోలు? సెలవైనచో మీసేవకుఁడే జ్ఞప్తికిం దెచ్చెడి.

రాము—ఏదియో చెప్పుము.

లక్ష్మ—మ. దనుజాధీశుపురంబునందు నొకయబ్దంబుంట దోషంబు చెం
దినదే మోయని శంక నొందఁగను ధాత్రీజాత యాభీల వ
హ్నినిఁ జొత్తెఱఁగ్రుశానుఁడే యమపురంధ్రీశ్రేష్ఠగా లాత్మలో
ననుమానింపకుఁడందు మీకొసఁగె దైత్యామర్త్యు లీక్షింపఁగన్.

భర—అగ్రజాతా! సకలసద్గుణోపేతా!

ఉ. పామరుఁ డాడినట్టి నుడిఁ బాయక నమ్మి సతీమతల్లినిన్
భూమిజ దుర్గమోగ్రవన భూమికిఁ బంపఁగఁ జెల్లునయ్య మీ
కేమివచింపఁగా వలయు నించుక శాంతి వహించిచూచినన్
మీమదికే యెఱుంగనగు మేలెదొ కీడెదొ రామభూవరా.

రాము—అనుజా! భరతా! ఇంతమాత్రము గ్రహింపలేక పెడదారిని బోవుచుంటివి. వినుము.

ఉ. హీనునినుండి వచ్చెఁ గద యీవినరాని నిరాపనింద యం
చీనుడి లెక్కపెట్టఁ జనదింతయు నంచనఁ బోకు ప్రాజ్ఞులెం
దేనియుఁ జెడ్డయున్న నిదియిట్లని పల్కరు లేనిశక్తు లే
వేనియునుంతు రీసడులు హీనులనుండియె వచ్చు నేరికిన్.

పామరులమాట పాటించి చిత్తంబునఁ దత్తరపడుట యుత్తమంబుగాదని వచింపకుఁడు. ఏలయనఁ దిట్టుఁబట్టుల కొడిగట్టిన కట్టెఁడి గిట్టినవెనుక నందకూపాది ఘోరనారకంబుల నొందును యశంబులేని మనుజుఁడు బ్రతికియుఁ జచ్చినవాఁడే. యశంబుగన్నవాఁడో చచ్చియు బ్రతికినవాఁడే. నానాలోకవిశ్రాంత సమజ్ఞాసంయుతంబైన భాస్క—

రవంశంబున నుదయించి యపకీర్తి నీవంశంబున కాశ్రయమిచ్చుట మనకుఁ బాడిగాదు. లో కాపవాదంబునకు జంకి జీవంబులైన జీవజీవంబులైన మిమ్మునైన నగ్నిసాక్షిగాఁ బరిణయం బును జేసికొనిన సీతనైన విడుచుటకు నియ్యకొంటిని. మీవిచారమును మాని మాటలు చె ప్పకుఁడు.

శత్రు—అర్క వంశదీపా ! అమితప్రతాపా !

సీ. సుతవియోగంబున మృతిఁగన్న మామకున్ గతులు గల్పించె నే గరితమిన్న
తనసతీభావంబు గనిపింపఁగనదగ్నిఁ జొచ్చియువెలసె నే సచ్చరిత్ర
పతిఁబాసి శయ్యాన్నపానంబులనరోసి కాలంబుగడపె నే కలుషదూర
జనకమహారాజు తనయకాదాయని యనిపించుకొనియె నే యార్యవినుత

తే. గీ. యాయబల సీత నిందుఁజాలాలి రత్న
గర్భజాత నయోనిజఁ గరుణమాని
కానకంపంగఁ దగదన్న ఘనులు మీకుఁ
దెలియని తగవు కొండైనఁ గలదె యనఘ.

రాము—అనుజులారా!

ఉ. కాంతనె పాణిపవిత్రములు గాఁదలపోయుదుఁ గంతమందు న
శ్రాంతము గట్టకొన్న జనుసన్నిధిమీర లుపన్యసింపఁగా
నెంతురుగాక నిందఁ దలయెత్తఁగజాలక పత్నివాంఛ యా
వంతయులేని వీనికడనా యిటుమీర లుపన్యసించుటల్.

చాలుఁజాలుఁ. మీవచోరచన చాతురీధురీణత్వము ప్రచురమయ్యె. వృథాకాంత క్షోభ మేల చేసికొనియెదరు ? అపకీర్తిత్యాగముకన్న బంధుత్యాగముకష్టముగాఁదోఁ చెనా ? లక్ష్మణా ! నేఁటితో నన్నుమాటఁ దప్పెదవా ?

లక్ష్మ—(తనలో) ఓహో ! ఈయనకుఁ గోపమంతకంత కతిశయిల్లుచున్నది. ఎన్నివిధం బులను జెప్పినను మావాక్యంబులను జెడచెవినిబెట్టుచుండె. పదుగురుకిఁ దగవుచెప్పి నిప్పుడ్యాంము తెగువఁబూనినఁ దగదని యెవ్వరు నొక్కి వక్కాణింపఁగలరు? సం వర్తసమయ ప్రచండదండధరుని భంగి ననుకరింపుచున్న యిమ్మార్తాండకులమాఁడ ను నండఁజేరుచమన్న హృత్పుండరీకంబు గడగడవడంకెడు ఏమిచెప్పుటకు నాలుక తడబడుచున్నది. హావిధీ !

ఉ. పట్టపుదేవియౌ తఱిని శాపపుఁజిత్తముచేతఁ గానలన్
గుట్టలఁ బట్టఁజేసితివి క్రూరనిశాచరుచేత నెన్నియో
చెట్టలనొందఁజూచితి విసీ యదిచాలకయా తలంచి తీ
పట్టున నాపెనున్మరల బాధనుబెట్టఁగ నోరిదుర్మతీ.

నీకు మేమేమియపకృతి నొనరించితిమని మాకొంపకు నవస్థలు ఘటింపుచుంటివి? (యోజించి) ఒనరింపకేమి? నీమనుమఁడగు రావణుని జంపితిమిగదా? (కోపముతో)

చ. మనుమనిఁ జంపినారనుచు మాపయిఁ గోపముఁ బూనిమాకుఁ గీ
డొనరుపఁజేతగాక త్రపనొంది యుపాయము వేఱులేక స
జ్జననుతసీతకు న్నయిపఁజాలనినిందను గూర్చినావుగా
మనుమనిగాదు నిన్నె దనుమంగనువచ్చెదఁ గాచుకొమ్మిఁకన్.

వేల్పుల పెద్దయని పేరుపెట్టుకొని యిట్టివక్రకార్యంబు లాచరింపుచుంటివా? నీయంతం బిప్పుడే నాచేతిలోనున్నది.

చ. తల పొగరెక్కి నీకుఁ దొలిదైవము నేనని శూలిగాంచి నీ
తలనొకదానిఁ ద్రుంపి పెనుతప్పునకుం దగశాస్తిచేసెఁగా
ని లిప్రుల లెస్సవాస్రితునను నీనలుచేతుల తీఁటఁదీర్పఁగాఁ
దలఁపఁడు లక్ష్మణుండిపుడె తకుఁబవ తీర్చెనుఁ దీర్చెదున్జుమీ.

(ముందునకు నడుచుచున్నాఁడు)

రాము——(వారించి) సౌమిత్రీ! తొందర నొందకుమా. సృష్టికర్తయైన బ్రహ్మమీఁద నీకీ కినుకయేల?

చ. కొలఁగనినట్టి మీవదినెఁ గొంకక చంపుము చేతఁగానిచోఁ
గొలఁగలకోమలిన్విడక గూడిన రాముని వీనిఁ జంపి నీ
కులమునకున్ యశంబునొనగూర్పుమ యీయిరువెన్ను లేదుడన్
దలఁపఁగ నేలొకో మఱొకదారినిఁ బాపమునాక తమ్ముఁడా.

తమ్ములారా! మొగమోటములేక నేనుజెప్పు నాకడసారిమాట వినుడుఁ.

చ. జనకజయున్న నాబ్రతు కసత్యము నేమనియున్న నావె యిం
కను మనియుంట కల్లసుఁడీ కావున నిద్దఱిలోన నన్నొ యా

మేనొ విడనాడుఁడీ వదినెమీఁదనె ప్రేముడి యెక్కుడైన నేఁ
జనియెదమీరలందఱును సౌఖ్యమొ కష్టమొ పొందుఁడిచ్చటన్

(అనిపోవుచున్నాఁడు)

లక్ష్మ—(వారించి) అగ్రజన్మా! ఎక్కడికిఁ బోయెదరు? మీరే యీపురంబునుండి వెడలిన నీతమ్ములు వీరుమువ్వురుమాత్ర మీసిరులనెల్ల రెండుచేతులతోడ జుఱ్ఱుమని జుఱ్ఱుకొందురా యేమి? మేమిదే మీయడుగులవెంట వెడలివత్తుము మీసుందర పాదారవిందములను భజించుటకన్న మాకేమి భాగ్యంబుకావలయు?

రామ—అన్నయందు మీభక్తియేమి? నే నెక్కడకుఁబోయిన మీరక్కడకురానేల? చాలుఁజాలు మీపొందు. అన్నయన్న మీకుభారమాయె. ఓదైవమా! రాముఁడేటికీ భారంపుఁబ్రతుకు బ్రతుకవలయు? బ్రతికిన నేమిలాభము? దేనిని బాపుకొనును?

చ. సతి యపవాదమొందె, ననుజన్ములె యాజ్ఞను సల్పరైరి, యే
హితులును లేరు, కట్టయిఁక నేమని జీవముతోడ రాముఁడీ
క్షితిపయినుండఁగావలె, నిసీ యెటులైన నొకభంగిఁ జంపుమీ
నతులను గాంచియైన వృజినంబని యెంచఁగఁబోకు ఖడ్గమా!

(నఱుకుకొనఁబోవుచున్నాఁడు)

లక్ష్మ—(ఖడ్గముఁనుదీసికొని)

ఉ. రామను గానలో నునిచి రమ్మనిచెప్పినయంతమాత్ర నీ
రామునిమీఁదికేగెదె పురంధ్రిని సత్యవచోసమేత నీ
రామహిళాలలామ నతిదారుణభంగిని డించనున్న యీ
పామరు నీకులాపశదుఁ బ్రాణముల న్గొనకేవు ఖడ్గమా!

(నఱుకుకొనఁ బోవుచున్నాఁడు)

భర—(వారించి) లక్ష్మణా! మీకీవెఱ్ఱియేటికి? చాలుఁజాలు. మిమ్ములను మీరే పరిపంథులనుగా భావించితిరా యేమి?

రామ—భరతలక్ష్మణశత్రుఘ్నులారా! త్రికరణశుద్ధిగాఁ జెప్పెడు నావాక్యంబును వినుఁడు

తే. గీ. సీత కింక రాముఁడు లేఁడు సీత లేదు
రామునకునింక సౌఖ్యమొ బామొ పడితి

మింతవఱకుబుణముఁదీఱె నీదినంబు
తోడ మాఱుపల్కఁడు నాతోడుసుంతు.

సుమిత్రాప్రథమ తనూజా! లక్ష్మణా! నీవే పోయిరమ్ము. ఇందులకుఁ దప్పినఁ బితృపితామహగతికిఁ దప్పినట్లేసుమా!

లక్ష్మ—ఓదయామయా! దైవమా! ఇమ్మహాత్ముండు తుట్టతుదకుఁ గంఠపాశంబుగా నొట్టునుగూడఁ బెట్టెను. ఇంకదప్పించుకొనుటెట్లు?

ఉ. ఎంతయుఁ గాళ్ళఁ ద్రేళ్ళబడి యేబతిమాలిన స్వాంతమందునా
వంతయుఁ బుట్టదయ్యె నకటా కరుణారసమన్న మాటయే
యింతకు సీతకర్మ మిటులీడ్వఁగ నెంతటివారు నేమి గా
వింతు రితండు పెట్టినది భిక్షగదా మఱియెంతవారికిన్.

ఈదుష్కార్యంబును జేతులారఁ జేయుమని నావ్రాఁతయుండె. తప్పించుకొందమన్నను నాకుమాత్రము తప్పకున్నది. ఔరా! గురువులయాజ్ఞ యెట్లు పీడింపుచున్నది. నే నేమిసేయుదును? సీతాదేవిని గానకుఁ దీసికొనిపోయెదనుగాక.

ఓలక్ష్మణా! అగ్రజాజ్ఞాపరిపాలన విధాన దీక్షాబద్ధకంకణా!

చ. వనములవెంటనంటి పదపద్మములన్ భజియించి లక్ష్మణుం
డనుజులయందుఁ జేతులకు నక్కఱకబ్బినటన్న మన్ననన్
గని యదికాల్పఁగా నసుముకట్టుచుఁ బెత్తనమూని యిట్టులీ
యనఘునికొంపఁదీయుదువె యక్కట పాపమూపంశిపోవదే.

హా! హాతదైవమా!

ఉ. ఖరుఁ బురుహూతజిత్తు దశకంఠుని మార్కొని యుగ్రదీక్షసం
గరముల వారిపాలఁబడి కట్టిఁడి నే మరణింపకుండుటల్
పరమపతివ్రతామణియుఁ బాపవిదూరయు నెల్లస్త్రీలకు
న్వరవడియైన సీత విపినంబున నొంటిగ డించిరానొకో?

ఓతల్లీ! మానినీమతల్లీ! సుమిత్రాదేవీ!

చ. కనికని పాయసాన్నమును కైకయుఁ గోసలరాజపుత్త్రియున్
గొనుమని యేలయిచ్చిరొకో మఱియిచ్చినఁ బిండమేలయ
య్యె నయిన నేలపుట్టలె నేనిటఁ బుట్టిన నేలగొంతు బ
ల్కిని బిసుకంగనైతి నను మీకొడుకన్నను మీకుఁ దప్పగున్.

(యోజించి) మాయమ్మను నన్ను నిందించుకొననేల? ఒకవేళ నేను బుట్టకయున్నను మాయమ్మ కనకున్నను సీతాదేవికి మాత్రమీ చెట్టతప్పిపోవునా?

చ. ఎలమిని రత్నగర్భకు జనించిన నేమి విదేహుచేతఁ లం
దలచిన నేమి యాదశరథావనిజానికి నెంచఁ బెద్దకో
డలయిన నేమి యీమె యకటా యొకనాఁటికి సౌఖ్యమెట్టెనో
కలవయినన్ బరాకునను గాంచియెఱుంగదు పుట్టివెట్టినో.

సమస్త సద్గుణ గణోపేతా! సీతా!

ఉ. పుట్టినయింట నేసుఖముఁ బొందినదానవొ గాని యమ్మ యీ
మెట్టినయింట నెన్నఁడొక మేలు నెఱుంగ వెఱుంగకుంట గా
కిట్టిదురంతకష్టముల నే పడుచుంటివి రామచంద్రుఁ జే
పట్టియు మూడుబంతులను వ్రాసిన కట్టిఁడిబ్రహ్మ వ్రాఁతచేన్.

రాము—తమ్ముఁడా! లక్ష్మణా! నిండుఁజూలాలి నేనెపంబున నడుకానలోడించి వత్తునా యనిశంకింపవలదు దానికొక్కయుపాయంబు చెప్పెదనువినుము. మొన్ననొకనాఁడు శుద్ధాంతంబున నేకాంతంబుననుండ సీతాకాంత మందాకినీ ప్రాంతారణ్య పుణ్యాశ్రమంబుల యందు మునికన్యలతోడం గూడి యాడుకొనువేడుక తనకుంగలదనియు నీమనోరథంబును శీఘ్రకాలంబులో నెరవేర్పుఁడనియు నన్ను ప్రార్థించెను. కావున నతిసాకుగా నశ్రాంతపాంధపరిశ్రాంత్యపనోదసంగయగు గంగకుఱంగట నాకుటాలోటజంబుచెంత విడిచిరమ్ము. నీకు మేలుకలుగుఁగాక. పొమ్ము. (నిష్క్రమించును.)

లక్ష్మ—మాసోదరునాజ్ఞ యక్రమంబైనను మీఱుట క్రమంబుకాదు, కావున నేనిప్పుడే యప్పుడమిపట్టినివల్మీకసంభవునాశ్రమపరిసరంబున డించివచ్చెద (నిష్క్రమించును)

భర—హా! హతదైవమా! తమ్మిచుట్టంబు కొలంబున కెట్టిచెట్టపుట్టెను. (ని)

శత్రు—ఏ కాలమున కేది సంభవముకాగలదో యది యనుభవింపకతప్పించుకొన ధాతకుఁగాని వానితాతకుఁగాని వశమా? మనసుసరిపోక పరితపించెదము కాని మనచేత నేమికాఁగలదు? దీనరక్షణ పరాయణుండగు నారాయణుండే నట్టడవిలోనున్నను బుడమిపట్టి నోముఁగావుత. (నిష్క్రమించును)

శ్రీరస్తు.

# కుశలవనాటకము

## ద్వితీయాంకము.

### అరణ్యము.

(సీతయు లక్ష్మణుండును ప్రవేశించుచున్నారు).

సీత—చ. అరద ఘుఘూళిగప్పెను ధ్వజాగ్రములందున గ్రద్దలాడెఁ గా
విరి దిశలెల్ల గ్రమ్ముకొనె ఫేరవసంఘము కూయఁజొచ్చె భా
స్కరుఁడు వెలుంగుమాసె దివసంబునఁ దారలు గానవయ్యెనీ
ధరణిచలించుచుండె జలదంబులు గర్జిలుచుండె లక్ష్మణా.

లెక్కకొక్క శుభశకునంబైనను గన్పట్టకున్నది. ఏమికీడు మూఁడునోయని మది బెదరుచున్నది. మది బెదరనేల? సకలసద్గుణమణిగణధరుండును నిజభక్తావనపరుండును బలిప్రద్విషు మదవిదళన నిశితాసికరుండును కౌసల్యాగర్భపయఃపారావార రాకాసుధాకరుండును, రఘుకులవరుండును నగు నాథుండు మదీయహృదయ సరసీరుహంబునఁ గాపురంబుసేయ నరిష్టంబులు సంభవించునా? కైకొనినది నాథునియాజ్ఞ. పోవనున్నది వాల్మీకి పుణ్యాపర్ణశాల. సందర్శింపనున్నది వాచంయమీంద్ర పురంధ్రులను. తోడనున్నది లక్ష్మణుఁడు. ఏమిభయము? కుడికన్నదరుచున్నది అంతకంతకీ యపశకునంబు లతిశయించుచున్నవి. శుభశకునంబన్నమాట కలలోనివార్తయయ్యె. మందునకైన లేదయ్యె.

చ. అపశకునంబు లెన్నొ గననయ్యెడిఁ గావున నీఫలంబు నా
ధవునకు నామఱందులకుఁ దక్కమలాక్షులకున్ మదీయ బం
ధువులకు మువ్వురత్తలకుఁ దోడగు వారికిఁ గాకయుండున
ట్లు వరమనుగ్రహింప సురలోకములార నుతింతుమిమ్ములన్.

లేదా యెవ్వరికి లేకుండఁ జేయుఁడని మిమ్ముం గోరెద. సర్వ శుభాస్పదంబులగు మత్ప్రాణనాథుపదంబులె భద్రంబు లొసంగుత. ఎన్నిచందంబుల ధైర్యంబవలంబింతమన్నను బట్టువడకున్నది. లక్ష్మణా!

సీ. పసుపుబట్టలతోడ భవదగ్రజన్ముండు భార్గవునెదిరించు పట్టునందు
వల్కలంబులతోడ వనమున కీవెనుఁ గౌసలేయుఁడు పోవుకాలమందు
హా తమ్ముఁడా లక్ష్మణా హాతోస్మియటంచు దానవుండఱచిన తరుణమందు
వనరాశి నాతోడ దనుజుండు దాఁటుచు నీచవాక్యములాడు నిముసమందుఁ

తే. గీ. చిత్తమంతగా ధైర్యంబు చెడకయుండెఁ
గాని యిప్పుడదేమొ యకారణముగ
గిరగిరతిరుగుచుండె బొంగరముకరణి
మేటిసుడిగుండమట్లు నేమిగతిమఱఁది

చిత్తమంతయు వేయిచేతులు పెట్టికలచినట్లున్నది. మత్కాంతుండు నితాంతసంతోషాక్రాంత స్వాంతుండై భవదిష్టంబులు వేఁడుమన వేఱొండేదియైనం గోరక గోలనై క్రూరపంచాస్యవారణ శార్దూలవరాహ ప్రముఖమృగసంచార ఘోరకాంతారంబును గాంచనేలకోరితిని? ఇట్టిపాడుబుద్ధి నాకేలపుట్టె? మున్ను పదునాలుగేండ్లడవులయందు బడలి బడలి మగుడ నేవడువునఁ జూడవేఁడితి? నామనోహరసుందర పాదారవిందంబులను డెందంబమందానందంబు నొందనర్చింపక యేలవిడిచివచ్చితి. నొచ్చితి. గతించినదానికి వగవనేమిలాభముకలదు? "బుద్ధిఃకర్మానుసారిణీ" యనుసూరిజనోక్తి రిక్తయగునా? (గంగను జూచి సంతోషముతో) లక్ష్మణా! సువర్ణసరోరుహానృత్తసారంగయు శీతవాతాపహృతాతితాపపాంథాంతరంగయు రంగదుత్తుంగ తరంగ మాలికాడోళికాందోళితశతాంగ ప్రముఖ పతంగయునైన గంగం గంటివే? ఈనదింగాంచుటంజేసి చిత్తంబుకలఁకయంతయు నేవలనికోపోయినది. ఏమినాభాగ్యము?

లక్ష్మ—(తనలో)

చ. తనపతియానయుఁ దనకుఁ దప్పకమూఁడెడుకీడు రెండుని
ట్లని యెఱుఁగంగ నేరక వియన్నదిఁ గాంచుటచేత నీప్సితం
బొనరెనటంచు సంతసిలుచున్నది యిట్టియమాయసాధ్వి కే
యనువునఁ జెప్పజాలుదు మదగ్రజు ఘోరతరాజ్ఞ యక్కటా.

చెప్పకయుండు టెట్లు? చెప్పు టెట్లు? అయ్యో! నాకిది గండముగా నున్నది. (విచారమునభినయించును)

సీత—ఉ. కాంచినయంత మాత్రమునఁ గష్టములన్నియుఁ బాపునీనదిన్
గాంచియు సంతసంపదవు కారణ మేమియొకాని నవ్యశో
భాంచితమైన నీదువదనాబ్జము తొల్లిటితేటఁ బాసి కా
న్పించెదుఁ దేరుపైనను పెట్టినబాధిగ నూర్మిళాపతీ.

ఏలయిాలీలమోగంబును జిన్నఁబుచ్చుకొంటివి?

ఉ. సొమ్ములనెల్ల లాగుకొని సొంపగువల్కలుగొందు నారచే
లమ్ముల నిచ్చి నీమనుజు లక్షణరాజితు నిన్ను నన్నుఁ గై
కమ్మ పురంబునుండి వనికంపెనుపట్టున నైన సుంతదుః
ఖమ్మును బొందవోయనఘ కారణమేమిపుడిట్లు లేడ్వఁగన్.

చ. ఘనమగుశక్తి చేత దశకంఠుఁడు పూనినయప్పుడైన ని
న్ననిమొన నింద్రజిత్తు నిశితాస్త్రపరంపరఁ గప్పినప్పుడై
నను నిసుమంత యేని వదనంబునఁ గాంతిఁ దొలంగ లేదె యో
మనుకులదీప యాపిత కిమందిపు డెవ్వరు పోసినారొకో.

లక్ష్మ—(జెచ్చవడును)

సీత—లక్ష్మణా! ఇంటిమీఁద మనసుపోయెనా యేమి? మనము తీసికొనివచ్చిన నూతనాంబరాభరణంబుల నిప్పుడే మునిసువాసినుల కొసంగి మరలుదము. ఈనదిని దరించియాశ్రమలదరికిఁబోవుదమా?

లక్ష్మ—అక్కడఁ దరణి యున్నది. పోదము. (పరిక్రమించి)

తే. గీ. భంగములతోడ భయదమై పరఁగుచున్న
యీనదిని దరింపఁ గలము గాననయ్యెఁ
గాని యంతకంతకు వృద్ధిఁ గాంచుచున్న
నాదుశోకాబ్ధిఁ దరియింప నావ లేదె. (విచారమునూచించును)

సీత—లక్ష్మణా! మార్గము తప్పుచున్నట్టులున్నది. చూడుము.

సీ. మునిబాలనిగమాధ్యయనఘోషములుగావు వ్యాఘ్రేభ కేసరిధ్వనులుగాని
దేవార్చనసుమ ధాత్రీజాతములుగావు కంటకోపేత వృక్షములుగాని

తాపసోత్తమహోమదహనకీలలుగావు ప్రజ్వలత్కాననవహ్నిగాని
వాచంయమీశ్వర పర్ణశాలలుగావు బహుభయంకరగుల్మవాటిగాని.

తే. గీ. చూడ మోదంబు కలిగించుచోటుగాదు
చూడ ఖేదంబు కలిగించుచోటుగాని
బాటఁ దప్పితొ భ్రమపడివచ్చినావొ
ఘానురశ్మియేనిఁ జొరనివనముసుమ్మ.

చ. మునులనివాసమైన సుమముల్ కుశలన్ గొనిపోవుఛాత్రు లెం
దును గనిపింపరేల శిశుధూమపువాసన దోఁచదేల కా
ననపుమృగంబు లొండొరులు నైజవిరోధముఁ బాయవేల యో
యనుఁగుమఱంది యింకయిన స్యందనమున్ మరలింపువెన్కకున్

లక్ష్మ—హా హతదైవమా (విలపించును)
సీత—ఏమిలక్ష్మణా! విలపించుచున్నావు. మనవారికి భద్రమేకదా?

ఉ. తప్పుగుకార్యమేది యతిదారుణభంగి నొనర్చి తన్నకుం
జెప్పక నన్నుదేవుగద చెన్నఁటిబుద్ధిని సజ్జనాళికే
ముప్పును జేయలేదుగద మోహవశంబున నన్నుగాంచి వా
తప్పుబఁ బల్కలేదుగద తాలిమి బూలఁగనేల చెప్పుమా

శరణనిచేరుదీనులను సాఁకవైతివా? గురులనుజూచి యపహసించితివా? కానికా ర్యమేమిచేసితివి? ఇప్పుడింతగా వాపోవుటకుఁ గాయణంబెయ్యది?

లక్ష్మ—చ. వెలఁదులుతాళవృంతములు వీవఁగఁగర్బురహర్మ్యమందుఁ బెం
పలరఁగనుండుసాధ్వి నిను హస్తిమృగాధిప ముఖ్యసత్త్వసం
కులభయదాటవీస్థలినిఁ గొంకక నిల్పిననాకుఁ బాపభీ
తిలవములేదు తెంపునను దెల్పెదఁబూనిన దుష్టకార్యమున్.

సీత—అంత దుష్టకార్యమేమియొనరించితివి? అట్లొనర్చుటకుఁ గతమేమి?
లక్ష్మ—ఉ. చూతము నాశయించికడుశోభిలుచుండెడు మాలతీలతన్
జేతను ద్రుంప వహ్నినిగనిం బడవైచినయట్లు రామభూ
నేతను బొంది గాఁలు నిను నెవ్వగ కాకరమైనకానలో
భీతిలడించినాఁడ నవివేకుఁడ మత్తుఁడ దుష్టచిత్తుఁడన్.

సీత—మీయన్నగారితోఁ జెప్పక నన్ను దీసికొనివచ్చితివా యేమి? ఎందులకు?

లక్ష్మ—కాదు. మాయన్నగారి యాజ్ఞప్రకారమున నే.

చ. కనికరమన్నమాటవిడి కాననసీమల నిన్నుబోలు సా
ధ్విని నపరాధదూరఁ గడుఁదెంపున వీడెడు దుష్టునన్యు నొ
క్కనిఁ గననేరకంటె నది గాదనకీఖలుఁడొప్పి లోకమా
తను గొనివచ్చినాఁడకట దైత్యుఁడుగాక మనుష్యమాత్రుఁడే.

ఉ. పూనఁగరానికార్యమును బూనినయీకులహీను లక్ష్మణున్
బ్రాణము వోవునట్లిపుడె పాయకశాప మొసంగు లేనిచో
జ్ఞానములేక యీగతి నకార్యము లెన్నియొ చేయుచుండి లో
కాన నఘోరకర్ముఁడగు గావున నెట్టిటో మట్టుపెట్టుమా.

సీత—మీయన్నగారే చెప్పినచో నిందు నీతప్పేమియున్నది? నీకేల శాపమొసంగవల
యును? నట్టడవిలో డించిరమ్మనియా నాథుని పిట్టపిడుగువంటియాన.

చ. కనకమృగంబువెంట వడిగాఁ జనుకాలమునందు లక్ష్మణా
జనకజసుమ్మియంచుఁ బలుసారులు ప్రేముడిచేత నీకుఁ జె
ప్పినపతి నన్ను నీకరణి వీడఁగఁబుచ్చెనె యేదియో పరా
కున విని యిట్టులాడితివి గుండెలుబ్రద్దలు సేయువాక్యమున్.

పరాకు కానిచో నేనీశిక్షకుం దగుతప్పేమి చేసితిని? జాగరూకుండవగు నీకుఁ బ
రాకెక్కడిది? నాకేదియుఁ దోఁపకున్నది. కారణంబును జెప్పుము.

లక్ష్మ—ఉ. రక్కసుఁడట్లుమక్కువఁ బురంబునకుంగొని పోయియొక్కయేఁ
డక్కడనుంచుకొన్న జలజాక్షిగ్రహించినిజాన్వయంబు పే
రెక్కుడుమంటఁ బెట్టెమనయేలిక రాముఁడటంచుఁగ్రొవ్వునన్
ముక్కడిమూఁకలాడనతి రోషముతో ననుజీరి యిట్లనెన్.

సీత—(ఆతురముతో) ఏమని?

లక్ష్మ—మీవదినెకోరిక ప్రకారము వాల్మీకిపర్ణశాలనెపంబుగాఁ దీసికొనిపోయి ఘోర
కాంతారంబున డించిరమ్మని.

సీత—హాదైవమా (మూర్ఛిల్లును)

లక్ష్మ—మదగ్రజుండు నిత్యసత్యవ్రతనిరతుండేని సీతాదేవి మూర్ఛనుండి లేచుఁగాక.

సీత—(లేచి) సౌమిత్రీ.

చ. అనలుడు సచ్చరిత్ర యనియాడఁగ నమ్మిగ నన్నునేలి యే
జనుఁడో వచించినట్టినుడి సైఁపక కానకుఁ బంపనాయె పం
పిసఁ నిదియిట్టులంచు నొకవేళనుబల్కఁగరాదె తన్నుదే
వునిబలెనెంచు నీయతివపూర్తిగ మాటకుఁగూడ నోఁచదే.

మ. సిగలోఁ బువ్వులు వాడకుండ నను నీజ్యేష్ఠాగ్రజుం డీవును
న్బగలున్ రేలును జేతనోమి పదిపైనాళ్లేండ్లరణ్యంబులో
నగరంబందునఁజేర్చి కట్టకడకున్ నన్ నిండుఁజూలాలి నే
మృగమో మెకంగఁగాన నుంచితి రివే మీరాజధర్మోక్తముల్?

మిమ్మనవలసిన పనియేమియున్నది? అపవాదమొందినయతివను భరించుటమాత్రము యుక్తమైనకార్యమా? నలువురు నవ్వకుందురా? దుష్టురాలనైన నన్నువర్జించి మీకులంబుభూషణంబును గాపాడుకొంటిరి. అగణ్యలావణ్యసదనంబైన మీసోదరువదనంబును సకలలోకక్షేమకరములైన కరములును సర్వశోభాస్పదంబులగు పదంబులను విలోకింపనుగాఁబోలు? అయ్యనా! నీవైన నిదియిట్టులనిచెప్పి తీసికొనిరాకపోతివి? అట్లు తెలియఁ జేసినచో నీసీత·

సీ. కడసారిచూపిదిగద యని కన్నుల కఱవుదీరఁగ మోముఁ గాంచకున్నె
పలుకుల కీనాఁడె పొలిమేరగాయంచుఁ గలమాటలన్నియుం బలుకకున్నె
యాశ్లేషమునకిదే యవసానమాయంచు నింపుమైఁ గడుఁగౌఁగిలింపకున్నె
యీపుట్టువందు నుద్యాపనమా జోహారులకంచు జోహారుసలుపకున్నె

తే. గీ. మనదు దాంపత్యమునకిదే మంగళంబ
యనుచు మఱిమఱి పలుమాఱు లడుగకున్నె
చెల్లినా ఋణమిఁక నాకు సెలవె పోయి
వత్తునా యనుఁగాని నోరెత్తకున్నె?

లక్ష్మ—అవును. ఎన్నితప్పులైనను నాయందే యున్నవి.

సీత—నీతప్పేమియున్నది? అన్నగారిశాసనంబుతమ్ముఁడు నిర్వర్తించుటవిధిగదా! "పితృసమోజ్యేష్ఠ" యనున్యాయము తెలిసిననీవంటి వాఁడ వుపేక్షింతువా? ఇంతకు మీయన్నగారు నిగ్రహానుగ్రహ సమర్థులు గదా!

లక్ష్మి—అమ్మా! ఎవరిశాసనమేమున్నది? ఎవరుచేసినదేమియున్నది? చేయుటకొఱకు సమర్థులా? కష్టదశయందు నుండుటచే నిట్లంటివి కాని నీకుఁ దెలియనిదేమియున్నది?

చ. మనుజుఁడు పూర్వజన్మమున మంచియొనర్పఁగ సౌఖ్యమబ్బు నె
గ్గొనరుప దుఃఖమబ్బు నెదియో సలుపన్వలె నేమియేమియో
కనవలె నంచు నెంచెదము కాని పురాకృత మెట్టులుండునో
యనుభవమొందకుండఁ దరమా యలధాతకు వానితాతకున్ ?

సీత—అవును. నాకర్మము నేనే నిందించుకొనవలయును. అజ్ఞానముచేత బలికితిని. భాస్కరవంశ సంభవులగు మీయందొక్క దోషములుండునా ?

చ. నగరుననుండ కుగ్రవిపినంబున గాసిని గాంతునంచు నే
వగవ రసాన్నముల్ తినక పర్ణములన్ దినవల్సె నంచు నే
వగవను గాని నాథుపదపద్మము లన్విడనయ్యెనంచు నే
వగచెద నెన్నఁడే నవధి పాయక కల్గునో లేక కల్గదో.

ముందేమికానున్నదో? ఇప్పటి కీదుర్దశ వాటిల్లినదిగదా? దుశ్శకునంబులతోఁ చినప్పుడేసంకటము సంభవించునో యని సౌమిత్రి యరదంబుమరలింపుమాయని నాలుకచివరకువచ్చి యంతలోఁ బతి పంపినప్పుడుతప్ప మఱియొకప్పుడు మునికన్యలను బరికించుభాగ్యంబు వలనుపడదని గట్టిగ బిగపట్టితిని. నట్టడవిలో నిట్టియిడుమలఁ గుడువుమని నానొసటివ్రాతయుండ నప్పుడేల నాలుకజాఱును? ఒకవేళ నాలుకజాఱి నేననినను ద్రిభువనంబులందు నడ్డములేనినాథుని శాసనంబెట్టు లతిక్రమణీయంబు?

లక్ష్మి—లోకమాతా! సీతా!

చ. విడువఁగరానిరామువిధి వీటికిఁబొమ్మనుచున్న నొంటిగా
నడవినినుండు నీయునికి యచ్చటకిన్ జనఁబోకుమంచు సా
పెడి నిటులౌట నిన్నెటులవీడుదునమ్మ యుపాయముండినన్
దడయక పల్కుమమ్మ పదతామరసంబుల కేను మ్రొక్కెదన్.

సీత—చ. పడఁతుకసౌఖ్యమున్విడిచి వల్కలముల్ ధరియించి భక్తి మా
యడుగులుగొల్చి కాఱడవులందు భరింపఁగరానికష్టముల్
గడచి ఫలాలు తెచ్చి యివిగో జననీ గొనుమంచునిచ్చి ప్రే
మఱిఁగ నిన్నట్టియోయనఘు పోయెదవే ననువీడి యియ్యెడన్ ?

లక్ష్మ—ఉ. ఎంతయుఁ బ్రొద్దునీకరణి నేడ్వకుమమ్మ విషాద మార్ప నీ
చెంతను జుట్టపక్కములు చేరెడువారెవరమ్మ తావక
స్వాంతమునందు రాముపద పద్మము లేమఱకమ్మ యవ్విరే
యెంతకుఁజాలునమ్మ సెలవిమ్మ కృపామతిఁ బోయివచ్చెదన్.

అయ్యో! పోవు టెట్లు? ఘోరగహనంబున నీయమ్మనుడించి యేగుటకుఁ గాళ్ళా డకున్నవి. మనసొప్పకున్నది. దారి కనుబడకున్నది. హా దైవమా. (విలపించును)

సీత—చ. అడలకుమన్న మీవదినె యందలి ప్రేముడినీడుమన్న యే
గడియకు నేదిసంభవము గాఁగలదో కనఁజాలమన్న ము
న్నడచినకష్టముల్ మరలఁగాంచఁగ నావిధియుండెనన్న యే
మఱియుదునంచు నెంచి యణుమాత్రముఁ జింతిలకన్న లక్ష్మణా.

సౌమిత్రి. ప్రొద్దెక్కినది. ఇంటికి నేగవలసినవాఁడవు కాని యిచ్చటనుండువాఁడవు కావుగదా!

లక్ష్మ—చ. అసురుఁడు మాయలక్ష్మణ హతోస్మియనంగ విచారమొంది న
న్వెసఁగని వజ్రపాతగతి నిష్ఠురవాక్యము లాడినావు గా
వ సిలుగువచ్చునంచనక నట్టడవిన్విడియేగినాఁడ నో
యసమగుణాంబురాశి జనకాత్మజ యేమనియిప్పుడేగెదన్.

సీత—సౌమిత్రీ! సౌమిత్ర. నాకర్మమునకు నీవేమిచేసెదవు? పూర్వజన్మంబునందే దంపతుల నెడఁబాపి సంతసించితినో యిప్పుడు తత్ఫలంబు ప్రాప్తమయ్యెను.

లక్ష్మ—అమ్మా! పోయెదనుగాని.

సీ. శశికాంతసౌధరాజము లెక్కుసుకుమారీ నీవేమాడిక్కఁ గొండలనెక్కఁగలవో
పూలపై నడువంగ సోలునీవేలీల నడవిముండ్లుల త్రోవ నడువఁగలవో
చిలుకపలుకుల కాత్మఁ దలఁకు నీవేభంగి నుగ్రమృగధ్వని కోర్వఁగలవో
పండువెన్నెలలకు వడగొట్టునీవెట్టు చండాతపములకు సైఁపఁగలవో.
ఆ॥ వె. స్వప్నమందు నేని భర్తను విడియుండఁ
జాలవెట్లు విడిచి తాళఁగలవో
తెలియదేమి నాకుఁ దెలిసిన దిక్కేది
సేయువాఁడఁ గఠినచిత్తజనుఁడ.

సీత—లక్ష్మణా! ఇంక నాకుభగవంతుండె దిక్కు. నీవుపొమ్ము.

ఉ. ఎన్నఁటికైన నాథుని నీకనుల న్గనుభాగ్యరేఖ న
కున్నదొ లేదొ యయ్యది గుణోదధి దేవుఁడెఱుంగు నట్లుగా
కున్న శరీరమూ న్విడుతు నోడక యెట్టులనన్నఁ జెంతనే
యున్నది విన్నవాకమడు గున్నవివ్యాఘ్రమదే భసింహముల్.

లక్ష్మ—(చెవులుమూసికొని) రామరామ. ఎంతమాటనాడితివి?

చ. కనుఁగొనకప్పుడొక్క త్రుటికాలము నోర్వని జీవితేశుఁడే
మనసును ఱాయిసేసికొని మాయురె గూబబలెన్ జరింప నీ
వనమునకంపెనంచు బలవంతపుఁజావును జావ కట్టెటో
కనులను రెంటిమూసికొని కాలముమెల్లఁగవెళ్ళఁదీయుమా.

సీత—నాగతియేమికానున్నదో! చావైన వలసినప్పుడు వచ్చునా?
బ్రహ్మదేవుఁడిచ్చినబత్తెము తీఱవలయునుగదా!

లక్ష్మ—గంపంతబలఁగంబుండియు దిక్కు మాలినదానివలె దురపిల్లుచుంటివా? ఎంతకష్ట మెంతకష్టము. జననీ! జననీ! (ఏడ్చును)

సీత—చ. పదిపయినాల్గువర్షములు వానలకెండలకోర్చియోర్చి మా
పదముల నాఁడుతోడువలెఁ బాయకభావములోఁ మెలంగుటన్
వదలఁగఁగాళ్లురాక ననుబల్మిఱుఁజీరఁగఁ బల్కు నేదియో
యిఱియవలేక పెద్దయెలుఁగెత్తి యదేపనిగాఁగ నేడ్చెదే?

ధీరుండవుకాదా! ఆపదలయందుఁగదా ధైర్యము ప్రకాశింపవలయును. పురుషుండవగునీవే వెక్కివెక్కి పొక్కెదనింక నాబోఁటి బోటిలెక్కా? సర్వము తెలిసిన నీకేమిచెప్పవలయును? నీవరిగి సకలసుగుణాభిరాముండును నీలపయోధరసన్నిభశ్యాముండును మదవద్విపతుసందోహ విరాముండును భూపాలసుత్రాముండును నగు శ్రీరామునిసన్నిధిం జేరి నామాఱుగా నమస్కరించి కరంబులుజోడించి యిట్లు మనవిచేయుము.

చ. అనుజానితోడవచ్చి రణమందునరావణు రూపుమాపి వే
ననుగొనివత్తురంచపుడు నాయుసురెట్టెటో నిల్పియుంటి లం

క నిపుడు మీరలేవిడువఁ గాయముఁబాసెద మిమ్ముభర్తగాఁ
గనుఁగొన జన్మజన్మములఁ గారుణికోత్తమ నేఁ దలంచెదన్.

పిదప మామయత్తలకు ముప్పురకు నభివందనం బాచరించితిననియుఁ జెప్పుము. కౌసల్యామహాదేవితో నిట్లు చల్లగఁజెప్పుము,

చ. వలదనినీవు సత్కరుణఁ బల్కినపల్కుల సమ్మతింప కీ
స్థలమునుజేరి నీచరణదాస్యముఁబాసితి నింకఁ బెద్దకో
డలపయిఁగల్గుప్రేమ నకటా యుదకంబులతోడవీడు మై
థిలి నమకానకంపితని తీండ్రము సేయకు నీదుకుల్జనున్.

భరతశత్రుఘ్నుల నడిగితిననియు దీవించితిననియుఁ జెప్పుము. పతులే సతులకు గతులని మా చెల్లెండ్రకు నెఱిఁగింపుము. ఎల్లచుట్టంబులను గూర్చువారలను సీతయనునొక్కతె కలదని జ్ఞాపకముంచుకొనఁ బ్రార్థించితినని నివేదింపుము.

లక్ష్మ—అమ్మా! నీవేదియో చెప్పుచున్నావు. విచారసాగరమగ్నుండనగు నాకుఁ జెవిని జొరకున్నవి. నిన్నిట్లు లేకతంబుగావిడిచి యేగుటకుఁ జిత్తమొప్పకున్నది. హాదైవమా! నేఁటితో సూర్యవంశఋణంబు దీఱెనా? అకటా! కాలమెంత విపరీతమయ్యెను.

సీత—సౌమిత్రీ!

చ. బంగరువంటికాఁపురము పాడయిపోయెను సీతతో నటం
చుం గడుఁబొక్కఁగావలదు సూర్యకులంబు యశోధనాప్తి వా
సింగని వేయియేండ్లకును సేమమునుండవలెన్ మఱేనొ మి
మ్ముంగని లక్షలంచు మదిమోదమునొందవలెన్ గుణోదధీ.

చ. అడవులఁ బుట్టినిల్లువలె నారసి యెప్పుడు గుడ్లగూబకై
వడిమనుమంచు నానుడుట వ్రాయఁగ నావిధి మూడుబంతులన్
గడుపిటులుబ్బ నేడ్చెదవు కాలము కర్మము కూడముట్టిన
ప్పుడెవరికెవ్వరయ్యా వినవో కనవో మఱిది గుణోదధీ.

అంతియేగాక.

చ. నలువురుగుంపుగాఁగలిసి నాతలపైనిడినట్టితప్పు భూ
తలమున నెట్టివారికిని దాఁటఁగఁజెల్లని రామునాజ్ఞ నీ

తలఁపునఁబెట్టి తొంటిదగు తాలిమిఁ బూనితివేని నీమొకై
వలవలయిట్టులేడ్చెదవె వచ్చినదారిని బోకయుందువే.

లక్ష్మ—అవును. రామాజ్ఞ నన్నింతకు బాధింపుచుండలేదు? మొట్టమొదట నిన్నీ ఘోర కాంతారంబునకుఁ దీసికొనివచ్చునట్లు చేసెను. ఇప్పుడు డించిపోవునట్లు చేయుచుండె. పోయెదనుగాని యొక్కటవినుము.

చ. పొలఁతులమిన్నలందు నినుబోలినదానవు నీవయౌట నిన్
బలికి మఱొక్కమానినిని బల్కఁగనుండుట నీకు నీతులన్
బలికెడువాఁడనే యయినఁ బ్రాజ్ఞవు ధీరవు నాదుతల్లితో
దులయగుదానవౌట మదిఁదోఁచియు తోఁచకొ చెప్పఁబూనితిన్

అదియేదియన.

చ. అమితవిషాదభారమున కాత్మఁదొలంగిన భూమిజాహత్యదో
షము మెడకంటఁజుట్టుకొను సంతతిఁగాంచిన వెన్కఁబావ నీ
యము కడుపారఁగన్న శిశునార్తునిఁజేసి దొలంగనేఁడు లో
కము నినునింద సేయు నటుకావునఁ బ్రాణములన్ భరింపుమా.

ఇదియే నాప్రార్థనము ప్రార్థనమాత్రమే కాదు వరము సుమా!

సీత—నాయట్టిదానికిఁ జావుకూడనా? అట్టిభాగ్యమా?

లక్ష్మ—సీ. న్యాయంబు సమసి యన్యాయంబుపైవచ్చు వేళలఁ గనిపించు వేల్పులార
సకలకర్మములకున్ సాక్షులై నిజమున కాధారులైన చంద్రార్కులార
కనుఁగొన్నమాత్రనఁ గలుషంబులనుబాపి భద్రాప్తిఁగనుమౌని వర్యులార
పరులబాధలఁగాంచి పాపంగఁదాపంబుఁ జెందుసత్కృపాసింధులార

తే. గీ. భర్తసెడఁబాపి మిన్నులుపడ్డచోట
నబల నీయమ్మునిల్పిన హంతయంచు
నామనవిఁ ద్రోసివేయక నయముమీఱ
సాఁకుఁ డీరాముదేవి నంజలులొనర్తు.

సీ. జనకునిచేతులందునఁ బెరిఁగినకన్య శ్రీరామునురముపైఁ జెలఁగుధన్య
దశరథక్ష్మాజాని తలయూఁపినచరిత్ర కౌసల్యమన్ననఁ గన్నకాంత

మఱఁదుల బిడ్డల మాడ్కి మన్నినమాత గురులందు సద్భక్తిఁగూర్చునెలఁత
ధాత్రీజనంబుల తలలోనినాలుక యఖిలగుణంబుల కాలయంబు

తే. గీ. నుండి యీసీత యీమె నేచూపుచేత
నరసెదరొ భారమంత మీయందుఁ బెట్టి
యరుగుచున్నాఁడఁ జంద్రార్కులార భూమి
పుష్కరములార దిశలార పుణ్యులార.

అమ్మా! పోయివచ్చెదను. శ్రీరామసుందర పాదారవిందంబులను మాత్రము డెందంబున నేమఱకుము. (నిష్క్రమించును)

సీత—(తనలో) లక్ష్మణుఁడు పోవుచున్నాఁడు. ఇంక నాకు గతియేది? చేరఁగడ యెవ్వరు? హా దైవమా!

ఉ. ఎక్కడికేగుదానఁ దెరువెయ్యదియో కనరాదు వాడిమిం
ద్దొక్కుడుగాఁగఁ గ్రుచ్చుకొని యెంత తపింపఁగఁ జేయుచుండె నే
నక్కట యింక నొక్కయడుగైనఁ గదల్పఁగఁజాల నూరకే
నిక్కడఁ బొక్కుచున్న నను నేడ్వకు మంచనుదిక్కు లేదుగా.

నాకు నేనే ధైర్యమును జెప్పుకొని పోవలయును. ప్రకృతిజనకుండగు జనకునికూఁతునై వనజాప్తవంశాభిరాముండగు రామునకుదేవినై నిజబలవశీకృత మహారథుండగు దశరథుని పెద్దకోడలనై కట్టకడకు దిక్కులేనిపక్షివలె నట్టడవిలోఁ జరింపనయ్యె. క్రూరసత్త్వరావంబులు కర్ణకఠోరంబులయి భయంకరములుగానుండె. ఎక్కడఁజూచిన నెక్కడొక్క మానవుండైనను గన్పింపఁడయ్యె. (పరిక్రమించి)

ఉ. కన్నులు పచ్చనయ్యె నఱకాళ్ళనుబొబ్బలుపుట్టె దేహ మ
న్నన్న వడంకఁ జొచ్చెఁ జెమటంతకునంతకు హెచ్చె నేదియో
తెన్నుగనంగరాదకట దీనజనావన దాసురాలి యీ
విన్నపమాలకించి గనవే దయసేయవె వేగ డాయవే.

నానాథునికే దయతప్పినప్పుడింక భగవానుని కెక్కడిదయ? పతికాదనినసతికి గతియెక్కడ? కావున నిత్తఱిని నాజీవితేశ్వరునే ధ్యానించెదగాక.

ఉ. రామునిదుష్టదానవవిరాముని సూర్యకులాబ్ధిపూర్ణిమా
సోముని నైజరూపజిత సుందరకాముని సర్వసద్గుణ
స్తోముని భీషణాజిఘనదోర్బలభీముని రాజరాజ సు
త్రాముని భక్తహృత్కమల ధాముని గొల్చెద నిచ్చనిచ్చలున్.

నన్ను బరిత్యజించినధవునకు నింక నెక్కడిదయ? అయ్యో! ధవునకే కానప్పుడేల బ్రతుకవలయు? (గంగనుజూచి) ఓస్రోతస్వినీమతల్లీ! ఆశ్రితకల్పవల్లీ! తల్లీ! భాగీరథీ?

తే. గీ. భర్తనెడఁబాసి పడరానిపాటులొంది
యుగ్రవనమందు బ్రతుకంగ నోర్వఁగాన
నిండుఁజూలా లిదియటన్న నెనరు మాని
కలుపుకొమ్మ నీలోన గంగాభవాని.

(పడఁబోయి సంశయించి) అయ్యో! గంగలోఁ బడిచచ్చుటయెట్లు? నన్ను జావ వలదనియుఁ జచ్చిన భ్రూణహత్యాదోషంబు దొడరుననియు లక్ష్మణుండు చెప్పెనుగదా! ఓలక్ష్మణా! కట్టకడకు నాప్రాణంబులకైనఁ బోగొట్టుకొనవీలులేకుండఁ జేసితివా? ఇంక నేను బ్రతికి పూర్ణిమాసోమునిబోలు జీవితేశ్వరు రాముని సకలపురంధ్రీజనశరణంబులగు మాయత్తగారి చరణంబులను గాంతునా? వానికినాకు నిన్నటితోడనే ఋణముదీరెనుగదా! ఇంక దేనిని బావుకొనందలంచి బ్రతుకవలయును? హా దైవమా! ఎక్కడకుఁబోవుదును? సంసారసముద్ర తరణంబులును సమస్తవృజిన హరణంబులును భక్తజనశరణంబులును నిఖిలభువన భరణంబులునైన నామనోహరుచరణంబులను సందర్శించుట కయోధ్య కేగవలయును. ఏగుటెట్లు? పురంబున నుండఁదగదనిగదా నాథునిశాసనంబు. కావున నక్కడకుఁబోరాదు. ఇంక మెట్టినింటిఋణము దీఱెనఁ బుట్టినింటి కేగవలయును. (యోజించి) అదిమాత్రము తగునా?

మ. శుభకార్యంబులయందో పండువులనో చుట్టాలచందంబునన్
విభుతోఁబుట్టినయింట నాల్గుదినముల్ పేరంటమున్ జేయుటో
ప్పు భరంబా మఱికాదు గాకయెప్పుడున్ బోవంగ మర్యాదయే
సభికుల్ మెత్తురె యంతకన్న నొకనైచ్యంబున్నదే స్త్రీలకున్.

అందు నీకష్టదశయందు నేగుటబొత్తిగా నేకూడదు. హా దైవమా.

ఉ. పుట్టినయిట్టు సైఁప నెదిపోయినఁబోవఁగనిమ్మటంచు నీ
చెట్టలఁబట్టఁజేసెఁ బతి జీవముల న్విడకంచు లక్ష్మణుం
డొట్టును బెట్టి మజ్జనకునోకముగూర్చి చనంగఁజాల నీ
పొట్టను జేతఁబుచ్చుకొని పోవుదునే పెఱవారికొంపకున్.

ఆఁడుదానికి మెట్టినయిల్లు పుట్టినయిల్లుగాక మఱియొక్కయిల్లు చేరనగునా ? ఇంతకు నీయడవిని నతిక్రమించినపిదపఁగదా యెక్కడ నివసించునది యోజింపవలయును? దేనికైన దరియున్నదికాని నామనోవ్యధకుంబోలె నీయటవికి దరి గానరాకున్నది. ఏమహాత్ముండైన నీయవస్థకుం దోడుపడఁడయ్యె.

వాల్మీ—(ప్రవేశించి) రామ రామ

సీత—ఈచెంత నెవ్వరోయొక మహానుభావుం డపరశివుండనొప్పి రామనామస్మరణంబు సేయుచు వచ్చుచున్నాఁడు. వారినిడాసి నమస్కరించెదను. (చూచి) మునికులసార్వభౌమా! నిర్వ్యాజకారుణ్యసీమా

ఉ. దేహము తాపమున్బొరయ దీనతనుంటిని బృధ్విఁగల్గు నే
యూహలు దక్కుచుంటి నెవరోముదురో ననునంచునుంటి నీ
దాహముసైఁపకుంటి నమృతంబగుమీ వచనంబువింటి ను
త్సాహముఁగంటి నిత్తఱికి జన్మముధన్యతఁగంటి మంటిఁగా.

వాల్మీ—అమ్మా! దీర్ఘసుమంగళీభవ. సుపుత్త్రావాప్తిరస్తు.

ఉ. ఎయ్యదికాఁపురం బభిదరొయ్యది యెవ్వఁడునీదుభర్త నీ
వియ్యొడనొంటిరాఁగఁ గతమెయ్యది దుఃఖమునొందఁగారణం
బెయ్యది యిప్పుడిచ్చోటికి నేగుచునుంటి సవిస్తరంబుగాఁ
జయ్యనఁదెల్పుమా మృదులసత్యవచోని చయప్రసిద్ధిగన్.

సీత—సంయమీశ్వరా! నయవినయగుణజనకుండగు జనకునికూఁతురను. చూర్ణీకృతప్రత్యర్థిరథుండగు దశరథుని పెద్దకోడలను. భాస్కరవంశవార్ధిసోముండగు రామునిదేవిని. మనయేలిక యొక్కయేఁడు లంకలోనున్న పడంతిని గ్రహించినాఁడని పౌరులుదూఱ వినియోర్వఁజాలక నన్నీవనంబునకుం బంపె. రావణమరణానంతరంబునఁ గష్టంబులన్నియుఁ దీరినవని సంతుష్టితోనుండ నట్టేట బుట్టిమునింగినట్టు లీచెట్టపుట్టి యడవులో బడి బడలి యడలవలసివచ్చె.

వాల్మీ—ఎంతకష్టమొదవెను? అయిననేమి?

చ. దివులును జెందకమ్మ మది దీనత శోకిలకమ్మ యెప్పుడే
దవు నది పొందకుండవలెనమ్మ వసుంధరజాత సీత యా
రవికులసింధుసోమునకు రామునకున్ దయపుట్టుదాఁక నా
భవనమునందునుండుము భవజ్జనకుం డొకఁడే నొకండనే.

అమ్మా! నేను వాల్మీకిని. మా పర్ణశాలలోనుండినఁ దప్పుగాదు. కొలఁదికాలంబులో సుఖంబునుగనెదవు.

సీత—ఉ. ఎట్టిదురంతకష్టముల నెప్పటికప్పుడు చిక్కుచుండినన్
బెట్టనికోట దాసులకుఁ బెద్దలదీవనలాటచేత నే
నొట్టుగనొక్కవేళ సుఖమొందిననొందుదునేమొ గాని నా
యట్టియభాగ్యతోడు సుఖమాఁగనుటా యిటులౌనె దానికిన్.

వాల్మీ—అమ్మా! వినుము.

ఉ. వెన్నెలపోయి చీఁకటియు వెన్నెల చీఁకటిపోయివచ్చుఁ గా
కెన్నఁడుఁ బీఁటఁబెట్టుకొనియుండునుగాఁపురముండ వట్టులీ
వెన్నుమ కష్టసౌఖ్యముల నెందుల కాగ్రహ మిట్లువచ్చెనో
యన్నరమాళికందులకె ప్రాప్తముగున్ దయ కాలసంగతిన్.

సీత—ముందు నాథునకాగ్రహమువచ్చునో? అనుగ్రహమువచ్చునో? ఇప్పుడేను బతి వియోగదుఃఖకృశానుకీలలఁ జావకుండినంగదా దేనినైననొందుట?

వాల్మీ—అమ్మా! శోకింపకుము.

చ. రవికులవర్ధనుల్ బలపరాక్రమరాజితు లస్త్రశస్త్ర మ
ర్మవిదులుయుద్ధదుర్వహులు మాన్యులు ధన్యులు సూనులిద్ధఱు
ద్భవమయి నీమనోవ్యథను బాపెదరొందెదువొంటిసౌఖ్య మం
తవఱకుఁ గన్నులెఱ్ఱపడఁ దద్దయు నేడ్చిన లాభమున్నదే?

సీత—దండుగలో ధర్మమన్నట్టు ఈనీచదశలో నిద్దఱుపుత్త్రులా? వారల నెట్టులోమఁ గలను? విద్యలెట్లువచ్చు? తండ్రికఱవైనబిడ్డలకుఁ జేయూఁతయేది?

వాల్మీ—అమ్మా! ఎంత వెఱ్ఱిదానవు? నేనుండ నీకు నొకింతయయినఁగొఱంతయుండునే? వినుము.

క. వేదచతుష్టయము ధను
ర్వేదంబును జెప్పి నీదుపుత్రకుల విద్యా
వేదులఁ జేసెదఁ జేతో
మోదం బొదవంగ నీకు ముమ్మాటికి నేన్.

కావున నీయుమ్మలికను మాని మాయుటజంబునకురమ్ము. మునిసువాసినులచేత సపర్యలఁజేయించెద. మీతండ్రియట్ల నరసెద. నీకేమితక్కువలేదు. ఎప్పుడులోపంబు జరుగనేరదు రమ్ము. అర్ఘ్యమ్ముఁగొమ్ము. మూఢులయినపౌరులు వాఁగిననేమి? నీ విమల పాతివ్రత్యం బాయనలునిచే నున్ను గరతలామలకంబుగా వెల్లడికాలేదా? ఎదుట నుండుటచే మొగమోటంబునఁ బొగడఁదొడఁగుటకాదు. దానివలన నాకగు లాభమేమి? పగవారికయినఁ దలయూఁపదగినవడవడికగలదానవు. దొడ్డదానవు. రమ్ము, తల్లీ! సతీమతల్లీ!

సీత—మీయాజ్ఞ యప్రతిహతమగుఁగాక. ఈకష్టకాలంబున నెచ్చటఁదలదాఁచుకొందునాయని వెదకుచునుండ నామీఁద నిర్హేతుకజాయమాన కరుణాకటాక్షంబును బ్రసరింపఁజేసితిరి. మీకిదే పదివేలవందనంబులు. మీకుటజశాలకువచ్చెదను. పోవుదమా?

వాల్మీ—మంచిది. పోవుదము. (నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము.

శ్రీరస్తు.

# కుశలవనాటకము

## తృతీయాంకము.

### సభాభవనము.

(రాముఁడు, భరతుఁడు, శత్రుఘ్నుఁడు, ప్రవేశించుచున్నారు.)

రాము—మ. కరిహర్యక్షుత రక్షుసత్త్వములరాకన్ జూచి యేమాడ్కి—హృ
త్సరసీజాతమునందు భీతిలితివో చండాతపంబందునే
కరణిన్ సోలితివో బుభుక్షఁ దృషనున్గాంక్షించి యెల్లెడ్చితో
వరుఁడే మూలముగా సికంచు నను నేపల్కంటివో మైథిలీ.

హాసీతా! సుగుణసమేతా! నామూలమున నెట్టియిడుమలఁ బడుచుంటివి!

చ. అడవులనన్నిటి న్వరుస నారసియారసి పొందినట్టి సం
కటములు నిన్నమొన్నఁగడ కర్మవిపాకముచేతఁదీఱె ని
కిటసుఖమొందవచ్చునని యేమిఁయొ యేమియొ యెంచుచుండఁగాఁ
గటకట క్రమ్మఱన్ గటికికాననమయ్యెనె పుట్టినిల్లుగాన్.

చ. ఖలుఁడగుమానవుండు నినుగాఱులు ప్రేలినయంతనమ్మి నేఁ
జలమునుబూని నిన్విడి విచారమునొందితిఁ జీవ రత్నమున్
శిలయనినంత వెట్టి తనచేతులమీఁదుగ వీడి యావలన్
వలవలయేడ్చినట్లు జనవంద్యచరిత్ర సతీ యయోనిజా.

హా జానకీ! ఈరాముని విడిచిపోతివా?

చ. ఎవ్వరిఁజేరువాఁడ గతియెయ్యది దుఃఖకృశానునార్చువా
రెవ్వరు నామనంబెఱిఁగి యెప్పుడు నీడవలెన్ జరించువా
రెవ్వరు మామమోముఁగను టెట్టులు ప్రాణములుండు టెట్లు నా
యివ్వగ పేద మేరగలదే యొకనాఁటికినైన మానినీ.

భర—అన్నయ్యా! శోకింపకుము.

ఉ. వెన్నుఁడవీవు నిన్నెపుడు వీడక నీడనుబోలెనుండు సం
పన్నతలక్ష్మిసీత యనపాయిని గాకెటకేగెనయ్య నీ
కన్న నెఱుంగఁ బెద్దలమె యన్నిరుఁ జింగిననీవె ఖేదమున్
గన్న మఱుంగువారలకు గాదిలితమ్ములకేది దిక్కుఁ కన్.

శత్రు—అగ్రజా! ఈగతజలసేతుబంధనమేల?

చ. అవనిజలాగ్నిమారుత వియత్తులుమీరయి యుంటసర్వము
ద్భవమయి వృద్ధిపొంది తుదఁ ద్వత్పకమందె లయించుఁగాన మి
మ్మవనిజ పాసియున్నదన నచ్చెరువయ్యెడిఁ బాయుటెట్లు మి
మ్మువిడిచి వేఱులేదని యమోఘముగా బుధులెల్లఁబలుక్కటన్.

లక్ష్మ—(ప్రవేశించి తనలో) అన్నగారు సీతావియోగంబున విలపించుచుండ భరతశ
త్రుఘ్నులూఱడింపుచున్నటులున్నది. నేను వారిని సమీపించెదను. అయ్యో?

ఉ. ఎట్టులరాముఁజూచెద మఱెట్టులశూలముగ్రుచ్చినట్లు మీ
పట్టపుదేవి నట్టడవి పాలొనరించితి నందు నన్ను ను
న్నట్టుగ నొక్కఁడే కటకటాయనికూలఁడె శూల లెమ్మిటం
చెట్టులలేవఁదీతు వగపేదు తెఱంగు నెఱుంగు టెట్టులో.

గుడ్డిమంగినవానికి గుడిలోనిలింగంబు వడియమన్నట్లు సీతామహాదేవిని ఘోరార
ణ్యంబున డించిన నాకు నిదియిట్టులనిచెప్పుట యొకక్కలెక్కా? (ప్రకాశముగా) అగ్ర
జా! నీతిఁబాసి లోకమాతయగు సీతను భీషణకాననంబున నొంటిగా డించివచ్చిన పరమ
కిరాతుండిదే నమస్కరింపుచున్నాఁడు.

రాము—తమ్ముఁడా! అన్యాయంబుగా నీవునిందించుకొనెదవేల? కుడిచికూర్చుండలేక
చేతులార నేనే చేసికొంటిని. నేను సీతకు యతినిగాకపతినా? ఎన్నిజన్మంబులకైన
నాకిదియేచాలు. హాసీతా! భువనపూతా!

సీ. శార్దూలసింహనిస్వనము లాకర్ణించి దివులొంది యెట్లు భీతిల్లినావొ
కఠినతరగ్రావకంటకాధ్వము లందు నెట్టుల నడుగులు పెట్టినావొ
యాఁకలిదప్పులనంది శీతాతపంబులయందు నెబ్భంగిఁ బొక్కినావొ
హా రామ హా రామ యంచు నన్ గూర్చి యహర్నిశ లేరీతి నడలినావొ

గీ. యకట నీవట్టు కష్టంబు లనుభవింపు
చుంట నమృతంబు ద్రావిన నుతగవిషము
నోజనుండె నాకీవు లేకున్న నాఁడు
నూఁడు భోగంబు రోగంబు చోటు చేటు.

సీ. వ్యాఘ్రేభహర్యక్షభయతమారణ్యంబు లారామపఙ్క్తులా యతివ నీకుఁ
గంటకపాషాణకలితావనీతలం బనువైనసెజ్జయా యబల నీకుఁ
గ్రూరనక్రవ్యాళఘోరగ్రహంబులు జలకంపుఁ గొలఁకులా చాన నీకుఁ
గర్ణకఠోరసృగాలారవంబులు శ్రావ్యతూర్యంబులా రమణి నీకుఁ

గీ. కందమూలఫలాదు లాఁకంటికొదవు
మధురతరపదార్థంబులా మగువ నీకు
నకట యెంతెంత కష్టంబు లనుభవింపు
చున్నదాన వీదురదృష్టు నవిడవాట.

లక్ష్మ—అగ్రజా! శాంతింపుఁడు.

భర—అన్నయ్యా! చింతింపకుఁడు. ఊఱడిల్లుఁడు.

రాము—గీ. రామ రామయంచశ్రువుల్ రాల్ప నేను
రామరామయంచశ్రువుల్ రాల్చుచుండె
పతిపదంబును బాసియుఁ బతిపదంబుఁ
బాయకుంటివా నీదుసద్భావమందు.

ఉ. ఎన్నివిధంబులెట్టులెటులెంచిన నీమొగమందు లెక్కకే
నెన్నఁడు నోగుగీఁత యొకయింతయు నొక్కటియైన లేదటం
చెన్నుచునుండ నట్టడవియే గృహమయ్యె నిదేమిపాప మా
చెన్నఁటిపాడుబ్రహ్మ తనచేతులతోడ లిఖించె నెందునో.

లక్ష్మ—అగ్రజాతా! సర్వముం దెలిసిన మీరేలయిట్లజ్ఞానంబునంబడియెదరు? ప్రాణికి సుఖదుఃఖంబులు నైసర్గికంబులుగదా!

ఉ. కూడునుగల్గియున్నఁ బసిగుడ్డలుశూన్యము గుడ్డలున్నచోఁ
గూడుపలికెక్కఁ రెంటనొనఁగూడిన వ్యాధులు పీల్చిపిప్పిగా
నూడుచు నొక్కఁడొక్కఁడికి నొక్కొకతీరగు బాధయుండు నే
గోడునులేనివాఁడు శతకోటికినొక్కఁడు లేఁడు దేవుఁడే.

భర—జ్ఞానస్వరూపులును ముక్తిప్రదులునగు మీరెఱుఁగనిదేది?

ఆ. వె. జలధరాంతరమగు చంచలాలతలైన
సకలమైనసిరులు శ్వసనచలిత
వారిజాతపత్త్రివనశీకరములైన
జీవితంబు లెందుస్థిరములౌనె.

శత్రు—తే. గీ. ఎచటనుండియో కాష్ఠంబు లేటఁ గొట్టు
కొనుచువచ్చి మధ్యఁగలిసి చనుదుఁ గుదకు
దేనియంత నదియెపోవు దీనికిట్లు
వగవనేటికి నీవంటివాఁడ వనఘ!

రాము—తమ్ములారా! మీమాటలు నాచెవిని జొరకున్నవి. లక్ష్మణా!

ఉ. నందన సోదరా జనక నాథ యయోయను చెంద బెండలో
కొండలమంద రక్కసులకొంపలు కూఁకటివేళ్ళతోడ నీ
సుందరిఁగూర్చికూల్చితిమి సుమ్మనుజన్మఁడ యేమిగంటి మే
మందును మందభాగ్యులకు సబ్బవుసౌఖ్యములెన్ని చేసినన్.

హా సీతా! వనితాజనతావిఖ్యాతా!

చ. తనయులఁగాంచి యీకులముఁ దామరతంపరఁ జేతువంచు నా
ననమును బెద్దఁజేసికొన నాగ్రహచారముచేత నీవు కా
ననమున నుండఁగావలసెనా! యకటా! మహిళాలలామ! స
ద్వినుతచరిత్ర! యెట్టిచెడువేళను గర్భము దాపరించెనో.

చ. ఎలమిని నీదు కెంబెదవి యిచ్చియునియ్యనియట్టులుంట హృ
జ్జలజమురొక్కక్కటితి జబ్బుగఁగాఁగిలిఁగొంట నర్మ పుం
బలుకులు తొంటిచందమునఁ బల్కకముగ్ధగనుంటస్సు రూఢిగాఁ
దెలిపెను నాకు నీఋణము దీఱుచునుండెనటంచు మైధిలీ.

లక్ష్మ—అన్నయ్యా! ఊఁఱడిల్లుఁడు. మించినపనికి వగచిన నేమిలాభము?

ఉ. తల్లియుఁ దండ్రియున్ సుతులు దారయుఁజుట్టలు మిత్రులంచుఁదా
ముల్లమునందు నెంచి కడునుబ్బుదు రత్తరమందు నెవ్వరో
తొల్లిటనెవ్వరో యెవరిత్రోవ మఱెవ్వరు చూచినార లీ
యెల్లశరీరధారులకు నెవ్వరికెవ్వరు వారె వారికిన్.

రామ—లక్ష్మణా!

ఉ. పుట్టినయట్టివంగసమొ పూజ్యము మెట్టినయట్టిగేమొ యి
ట్టిట్టనరానియట్టిది యహీనగుణంబులొ వానియంత నే
పుట్టువుతోడఁబుట్టినవిపో మనజానకి కోరితమ్ముఁడా!
యట్టిపడంతి నాకునిఁకనబ్బదు జన్మములెన్నియెత్తినన్.

లక్ష్మ—రవికులదీపా!

ఉ. హారములేదటంచో తనయాలికి సంతతి కంబరాది సం
భారములేదటంచో కడుభాగ్యముభోగ్యములేదటంచో మా
వారలుచచ్చిరంచో పెనుబాములఁజిక్కుచునుండ్రు గాన సం
సారముగన్నవారికె విచారముగా కొకసౌఖ్య మున్నదే.

భర—జననమరణంబులు వియోగసంయోగంబులు సుఖదుఃఖంబులు జీవులకు స్వాభావికంబులని మీబోఁటిప్రాజ్ఞులే వచియింతురు. తెలుపఁదగినది యేమియున్నది?

శత్రు—నీవు సత్యజ్ఞానానంద స్వరూపపరబ్రహ్మంబవు. సీత బ్రహ్మవిద్య. లోకంబులు నీస్వరూపంబు నిన్నునమ్మిన మహానుభావులె పుత్త్రమిత్త్ర కళత్రంబులయందు విరక్తి కలిగి భక్తియుక్తిచేత ముక్తులయ్యెదరు.

రామ—ఉ. అంబుజనేత్రలేని సమయంబున ఖాద్యఘృతాదిసంయుతా
న్నంబు విషంబు గేహము వనంబు వినూతనరత్నహారసం

ఘం బసమానభారదము కాంతలకాంత విరాజమానత
ల్పంబు కఠోరభూధరము వాసరమో మఱి బ్రహ్మకల్పమున్.

ఆ. వె. లేకలేకతాల్చె లేమ గర్భంబు నే
నట్టిదాని నడవి కంపినాఁడ
నెన్నిజన్మములకు నిదెచాలుఁ జూచి చూ
చి యొనరించియుంటఁ జేతులార.

దీనిచేతనే వియోగంబునకన్న వేయియంత లడలుచున్నాఁడ. సీతను దీసికొనివ
చ్చిన నపవాదము భరింపఁజాల. తీసికొనిరాకున్నఁ బాపంబు తప్పదు.

లక్ష్మ—అగ్రజాతా! వివేకప్రదాతా!

చ. కడచినదానికిన్వగవఁ గార్యముకల్గునె చిత్తశాంతి యే
ర్పడ హయమేధయాగము నవారణవిక్రమ లీలఁజేసి వం
గడమునకున్ యశంబు కలకాలముగూర్పుము భూతతృప్తియున్
వడయునుదాన నీవ తగువాఁడవు దీని నొనర్పు మగ్రజా.

రాము—తమ్ముఁడా! చక్కఁగా జ్ఞప్తికిఁదెచ్చితివి. రావణ సంహారానంతరంబుననుం
డియున్న యీమనోరథంబున కిప్పటికప్పు డంతరాయంబులు కలుగుచున్నవి. ఇప్పు
డైన మేల్కొనిచేయుట సమంజసము. సర్వపాపక్షయాకరంబైన యశ్వమేధంబు
దుస్సాధ్యంబు. తద్విధానంబును బోధించుటకు మునికులవరిష్ఠుండగు వసిష్ఠమహాముని
దందుఁడిందు వచ్చిన బాగుగానుండును.

వసి—(ప్రవేశించి) ఓహో నేనురాకమునుపే నన్నుఁ దలంచుచున్నారు. ఇదిగదా మం
చితరుణము. వీరిని సమీపించెదనుగాక.

రా. ల. భ. శ. మునీంద్రా! వందనములు.

వసి—శుభంబు కలుగుఁగాక.

రాము—ఈయున్నతాసనంబు నలంకరింపుఁడు.

వసి—మంచిది (కూర్చుండును)

రాము—హానిచంద్రమా! దశకంధర సంహారసంజనిత బ్రహ్మహత్యాఘవిచ్ఛేదనంబునకు ను సీతావియోగ ఖేదోపశమంబునకును నొక్క తురంగమేధంబు సేయ నుపక్రమించితి. తద్విధానంబు నెఱింగించి నాజ్ఞంబునకు సార్థకంబును గల్పింపుఁడు.

సేవ—(ప్రవేశించి) ప్రభూ! నారదవిశ్వామిత్రమహర్షులు తమదర్శనమభిలషించి ద్వారంబుకడనున్నారు.

రాము—వారు మహనీయులు. నిరాతంకంబుగా లోనికి రానిమ్ము. (తనలో) వసిష్ఠమహర్షి యిక్కడనున్నాఁడని కాఁబోలు. నారదుఁడు విశ్వామిత్రునిదీసికొనివచ్చినాఁడు? ఈవసిష్ఠ విశ్వామిత్రులకుఁ గలహము రాక యెవరితావులకు వారుపోయినపిదప నేఁడు సుదినమని చెప్పవలయును.

వి. నా—(ప్రవేశింతురు)

రాము—(లేచి) మునీంద్రులారా? నమస్కారములు ఈపీఠంబుల నలంకరింపుఁడు.

వి. నా—సామ్రాజ్యప్రాప్తిరస్తు. (కూర్చుండుదురు)

వసి-రామా! నన్నశ్వమేధవిధానంబుగదా యడిగితివి. వినుము. పాండుస్నిగ్ధశరీరంబును శోణశిరోధియు శ్యామకర్ణంబులును సువర్ణచ్ఛాయం దనరు దీర్ఘపుచ్ఛంబునుగల వాజి సవన దీక్షన్వహించి నవరత్నగంధమాల్య మృగమదాదులచే నర్చించి నిజబిరుదపట్టంబు నలికభాగంబునం గట్టించి భూచక్రంబెల్లఁ దిరుగఁబంపవలయును. ఆయజ్ఞీయాశ్వంబును రక్షింప నవక్రపరాక్రమక్రమధురంధరులను బంపవలయును. సద్వంశసంభవులును సత్కర్మానుష్ఠాన పరాయణులును నగు సహస్రబాడబులు ఋత్విజులు వరణీయులు కావలయును. వారి కొక్కొక్కరికి నొక్కొక్క వారణంబును నొక్కొక్క స్యందనమును సహస్రసైంధవంబులను సహస్రక్షీరప్రదగోవులను వేయిబారువులమహోరజతంబును నల్లుము మౌక్తికంబులను భటచతుష్టయంబును గానుకగా నొసంగవలయును. సర్వసర్వంసహాచక్రంబు నవక్రంబుగాఁదిరుగఁబంపినతురగం బరులచేఁబట్టుపడినఁ గ్రతుభంగమగును.

విశ్వా—(తనలో) ఈవసిష్ఠుండు పురోహితుండగుటచే నేదియో చెప్పి విత్తమాజీజాంచెనున్నాఁడు. నే నడ్డదిడ్డంబులాడి వీని యాశాభంగంబు గావించెదను. (ప్రకాశముగా) పురోహితశ్రేష్ఠా! వసిష్ఠా! సతులే సద్గతులకుఁ గారణభూతలనియు నతిథి

పితృదేవతాతర్పణంబులును యశోభోగారోగ్యసౌభాగ్యంబులును వారివలననే కలుగుచున్నవనియును నీకుఁ దెలియునా?

వసి—నీతోఁ దెలియుననేమి? తెలియదననేమి? కోపము ముందుపుట్టి తరువాతఁబుట్టి ననీతో మాకధికప్రసంగమేల?

విశ్వా—పాపభూయిష్ఠా! వసిష్ఠా! తెలియదని చెప్పుము. తెలియనిసంగతి తెలిసినవానివలె నటించుచు లేనిపోనికవచంబు పయినవేసికొని తగుదునని తలయెత్తెదవేల? తెలిసినచో నపత్నీకునిచేత మఘంబు సేయింపసమకట్టెదవా? అగ్నిహోత్రాధికారంబులు సతులు లేక వచ్చునా? ఎవరున్ననేమి? లేకున్ననేమి? ఏదోయొకవిధమ్ముగా నీపురోహితపుఁగట్నమ్ము ముట్టినం జాలు. నీనూఱుగురిబిడ్డలను జంపితినిగదా! ఇంక నెవ్వరికొఱకయి యీబూటకంబులు మాటుమాటునఁబన్ని సొమ్ములాగెదవు? ఛీ! నీమొగంబు చూడరాదు. సభ్యులారా! ఈవసిష్ఠమత్తగజం బీ విశ్వామిత్రాంకుశంబుండుటచే నిట్లుండెఁగాని లేకున్న విచ్చలవిడిగాఁ దిరుగదా? ఆఁప నెవ్వరివశము?

నార—(తనలో) నేనిత్తఱి వసిష్ఠవిశ్వామిత్రులకుఁ గలహంబు గల్పించెద. లేకున్న నీదినము లంఘనము. (ప్రకాశముగా) సీత లేకుండ సత్రం బుపక్రమింపరాదు. ధర్మమునకేమి? ఏదియోగత్యంతరము కల్పింపవచ్చును గాని జనకమహారాజుతోఁ జెప్పి సీత నీరామునకిప్పించినవాఁడగుటచే విశ్వామిత్రుండు సీతావనవాసక్లేశంబునకుఁ గంటఁదడిపెట్టుచు జనకుని నింకనేమొగముతోఁ జూతునాయని చాటుచాటునఁ దిరుగుచున్నాఁడు. సీత లేకుండ జన్నంబుసేయుట మాబోఁట్లకే విచారకరముగానుండ నీవిశ్వామిత్రునకంతంతమాత్రపుఁగష్టములోనిదికాదని వేఱే చెప్పవలయునా? గొప్పకష్టమే.

రాము—ఏమి కలహభోజనా! విశ్వామిత్రక్రోధానలంబును సమయోచితవచనేంధనంబులచేతఁ బ్రజ్వలింపఁజేయుచుంటివా? మహానుభావా! మైత్రిగలట్టివారికే చుక్కయెదురుచేయు నీయట్టివాఁడు సహజవైరుల నేమిచేయఁడు? కుప్పిగంతులు వేయించిన వేయింతురు. దయచేసి తాముమౌనముద్రను ధరింపుఁడు. అదియే మాకుఁబదివేలు.

వసి—విశ్వామిత్రా! విశ్వామిత్రా! బారలుచాఁపఁగలుగుదుననియుఁ బెద్దగొంతు పెట్టుకొని యఱవఁగలననియు నిక్కిమిన్నుమన్నునుంగానక కంఠశోషను జేసికొనెదవేల? సపంకోదకంబును బానంబుచేసి శాలూరంబు బెకబెకమనినట్లు దివ్యచూతరసము నా

స్వాదించియుఁ బికమనదని నీకుఁ దెలియునా? అష్టాపదరూపంబున నవనిజనుగల్పించి యపత్నీకతకొంతలేక జన్నంబు సేయును. ఇంచాక్షేపణ మేమున్నది?

విశ్వా—(నవ్వి) భూసుత కామువ్వరుసతులే పురుడుకారన్నప్పుడొక్క ప్రతిమయగునా? ఎట్టియోజన చేసితివి? నీతెలివికిఁ గడుసంతసించితి. సీతవచ్చినం గాని యీయాగంబు సమాప్తినొందదని ఘంటాపథంబుగాఁ జెప్పుచున్నాఁడ. నీమనోగర్వమడంప నేనేదియయినఁజేయఁగలను గాని యీరామచంద్రుఁడు మత్సవనరక్షకుండగుటచే నుపేక్షించితి. దుర్మతీ! నీమొగంబునుజూచినఁ బంచమహాపాతకంబులు మెడకుఁజుట్టుకొనును. కావున నేనుబోయెదను. మంత్రమని యంత్రమని తంత్రమని నీపాటు నీవు పడుము. (నిష్క్రమించును)

వసి—రామా! ఈయమితకోపితోఁబనియేమి? మీకిష్టఫలంబు సమకూరును. సవనంబున కారంభింపుఁడు.

నార—రఘుకులసార్వభౌమా! రామా!

తే. గీ. మూఁడుమూర్తులోయననొప్పి మూఁడుగుణము
లోయనఁగఁజెల్లి నీభ్రాతలుందు రతుల
బలపరాక్రమోపేతులు జ్వలదుషర్బు
ధనిభహేతులు నీయాజ్ఞ ననుసరించి.

కావున సర్వవిధంబుల సమర్థుండవు. క్రతుదీక్షం బూనుము.

రాము—చిత్తము. తమబోఁటిమహాత్ములుండ మాకేమికొఱంత? సవనాశ్వంబువెంట శత్రుఘ్నుని బంధువులనుబిలుచుటకు భరతుని జనకమహారాజు నాహ్వానింపలక్ష్మణునిఁ బంపించెదను.

వసి-నార—మంచిది. అట్లనే చేయుము.

రాము—పరదర్పఘ్నా! శత్రుఘ్నా! నీవు జన్నంబుతత్తడివెంటనరుగుము.

శత్రు—చిత్తము,

రాము—అనుఁగుఁదమ్ముఁడా!

ఉ. పగ్గె నిరంకుశంబనుచు వారిని వీరిని జంపకయ్య యే
యెగ్గొనరింపకయ్య యెవరేని నెదిర్చిన విల్లుద్రుంపనో

పగ్గముఁ ద్రెంపనో రథము పాడుగనో కను మందజీర్ణ నే
లగ్గనుబొందుభూధవుఁడు లంకనొనర్చితి మెట్లుచాలదే.

చ. కడుబలమున్న వారమని గర్వమున న్గనుపడ్డవారలన్
గెడపుచు వారిభామినులు ఖేదముఁనొందఁగ సొమ్ములాగఁగాఁ
గొడుకుల కొమ్మలా యెవరికోసము దుష్కృతమున్ గడింప నేఁ
గడఁగుదు జన్మజన్మములఁగా జేయవెట్టదె కర్మమెన్నఁగన్.

చ. ఎడ తెగసట్టిబత్తి నెపుడీశ్వరుఁ గొల్చినపఙ్క్తికంధరున్
గెడపుటఁ బాతకవ్రతన సఖి నవ్వనికంపుట బిడ్డపాప మే
ర్పడెనని దానిఁ బాయఁగదరా తలయూఁపితి నెట్టులెట్టో తి
త్తడిసవనంబు సేయుటకుఁ దమ్ముఁడ గాకెఁక నాకు నేటికిన్.

క్షత్రియులందఱికీ నావచనంబులుగా నిట్లు మనవిచేయుము.

ఉ. వచ్చినబ్రహ్మహత్య యుపశాంతముగాఁ బాయఁగ యాగము సేయుచుంటి మా
హెచ్చునకేమిగాదు మిము నెల్లర గెల్చుతలంపుగాదు మీ
యిచ్చ దురాగ్రహంపడకుఁడీ దయసేయుఁడు యధ్వరక్రియల్
మెచ్చుగఁ జూడుఁడీయిదియ మీకును మాకు శుభంబు క్షత్రియుల్.

శత్రు—చిత్తము. మీయాజ్ఞాప్రకారంబున నే మెలంగెద. (నిష్క్రమించును)

రాము—నిరంతరామోదనిరతా! భరతా! నీవేగి చుట్టంబుల నందఱిని బిలుచుకొని రా వలయును. వారితో నా ప్రార్థనగా నిట్లు నివేదింపుము.

ఉ. బంధువులార మాయెడఁ గృపారసము పూసుచు నధ్వరంబు ని
ర్బంధముగా నొనర్పుఁడు భరంబును మీతలలందుఁ బెట్టి యీ
బంధుఁడు పేరుమాత్రమునఁ బైపయి నుండెడు మంచిచెడ్డ లీ
రందఱు పంచుకొండు భవదాగము మే పదివేలు వీనికిన్.

భర—చిత్తము. అట్లులనే పిలుచుకొనివచ్చెద. (నిష్క్రమించును)

రాము—సుమిత్రాపుత్ర ప్రథమతనూజా! లక్ష్మణా! జనకమహారాజుగారిని నీవు తోడుకొని రావలయును. వారికి నీవు నామాటగా నమస్కరించి చేతులు జోడించుకొని ఇట్లు నివేదింపుము.

# తృతీయాంకము.

శా. కూఁతు న్గానకుఁ దోలినట్టిజడుఁ డీక్రూరాత్ముఁ డేమోముతో
నీతిం బాయుచుఁ దమ్ము నంపె ననుచున్ నిందింపకయ్యా భవ
చ్చేతోవీధి కగోచరంబె యిఁక మా నేమంపుభారంబొ యే
రీతిన్ దప్పను తండ్రి చూపిచనె మీరేనిక్క మూకించిలన్.

ఉ. బిడ్డయె లేనికాలమున విందులకెట్టుల వత్తుమంచు మీ
రడ్డముఁ జెప్పఁబోకుఁడు త్వదాత్మజయుండిన నేగుదెంచు టే
విడ్డురమా ను నేనపుడు పిల్వనెయక్కఱలేదు చేతులన్
గడ్డముఁబుచ్చుకొంచు మఱి కాళ్ళఁ బయింబడువాఁడ దాసుఁడన్.

లక్ష్మ—చిత్తము. నాశక్తికొలంది బతిమాలి తీసికొనివచ్చెద.

(నిష్క్రమించుచున్నాఁడు)

రాము—మునులారా! సవనశాలకరుగుదమా?

వసి—నార—మంచిది. అందఱమేగుదము. (అందఱు నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.

శ్రీరస్తు.

# కుశలవనాటకము

## చతుర్థాంకము.

### పర్ణశాల.

సీత—(ప్రవేశించి) కుశుఁడు భోజనముచేసిపోయెను. లవుఁడింకను రాఁడయ్యె.

ఉ. నిరతము ప్రొద్దుప్రొద్దునను నిద్దురకన్నుల బువ్వయంచు నా
సరసకుఁజేరుబాలుఁడు త్విషాంపతి మింటికిమధ్య నిల్చినన్
శరణముఁజేరఁడయ్యె మదిజాలినిబొందెడు హేతువేదియో
యరయఁగరాదె భద్రమెకదా గుణభూషణ దీనపోషణా.

అబ్బ! లవుఁడెప్పుడేదియో యొకదుడుకుపనిని జేయుచు నేయుండును. కొట్టైడు నీడు తప్పిపోయినది. కన్నులబెదరించినను బెదరఁడు.

సీ. తాతగడ్డములాగి దండమొక్కెడఁదాఁచి కొంటెపనులుచేసి కొన్నినాళ్ళు
ఈడువారలఁగొట్టి యెన్నెన్నొతగవులన్ గొంపమీఁదికిఁదెచ్చి కొన్నినాళ్ళు
చదువన్నమాత్రాన సద్మంబునుంబాసి కూటికైననురాక కొన్నినాళ్ళు
శస్త్రాస్త్రవిద్యలన్ సామర్థ్యమునుబొంది ఘోరలీలలుచేసి కొన్నినాళ్ళు

తే. గీ. నన్ను లవుఁడేడిపింపుచున్నాఁడు గడియ
యేనిఁగాలుసేతులు రెండు నెప్పుడూర
కుండ వెందుఁబోయిన నేదియోయొకందు
నెత్తిమీఁదికిఁ గొనిరాని నేఁడెలేదు.

ఈదినంబున నేదితెచ్చిపెట్టునో తెలియదు. కాలిచప్పుడు వినవచ్చుచున్నది. ఎవరో? మాచిన్నపట్టి లవకుమారుండే నా?

నిమి—(ప్రవేశించి) అమ్మా! నేను నిమిని మునితనయుండను.

సీత—తండ్రీ! నీవు మాలవునిజాడ నేమైన నెఱుఁగుదువా?

నిమి—తల్లీ! మీలవుండును గతిపయఋషి దారకులును నేనును సర్వర్తుకుసుమఫలవిరాజితపాదపోపేతంబగు నొక్క వనంబునకరిగి యచ్చటఁ బచ్చికపట్టుల ముచ్చటదీర నాడుకొని వసుధారుహంబులనెక్కి పర్ణంబులనుగోసి దేవపూజార్థంబు సుమంబులను సంగ్రహించి వచ్చుచుంటిమి. అప్పుడా బాటనొక్కచోటఁ దారహార హీరనీహార పటీరడిండీరంబులంబోలిన మేనును బద్మరాగ ప్రవాళంబులంబోలిన శిరోధియు సువర్ణ వింజామరలంబోలిన దీర్ఘపుచ్ఛంబును నింద్రనీలంబులం బోలిన కర్ణంబులును గలిగి యుచ్చైశ్శ్రవంబును ధిక్కరించు నొక్కతురంగం బంతరంగం బుప్పొంగఁ బురోభాగంబునఁ గాన్పించెను.

సీత—మీరుగాని మాచిన్నవాఁడుగాని దానిజోలికిఁ బోవలేదుగదా!

నిమి—తల్లీ! సమాహితచిత్తవై యాలకింపుము. అట్టులఁ గన్పట్టెదుటఁ బొడఁగట్టిన ఘోటకాలిక పట్టికంగట్టియున్న యసాపదపట్టంబున నొక బిరుదపద్యంబుకూడ కన్పట్టె

సీత—తరువాత!

నిమి—ఆబిరుదపద్యంబు లవకుమారుండు సాంతంబుగాఁ జదివి ప్రళయకాల మహాకాలునింబోలె మండిపడియె.

సీత—అట్లుమండిపడుటకుఁ గారణమేమి? అందేమి వ్రాయఁబడెను?

నిమి—ఎవరో వీరసువునూనుఁడఁట. అతఁడువిడిచిన క్రతుతురంగంబఁట శూరులైన నన్నుఁ బట్టుఁడని వ్రాసియుండెనఁట.

సీత—ఆవ్రాఁత కీబుడుతకుఁ గినుకయేల?

నిమి—ఏమిచెప్పుదును? మా మాతయగు సీతాదేవియుండ వీనితల్లి వీరసువెట్లగును? అంతియేగాక శూరులైన నన్నుఁ బట్టుడనిగదా వ్రాయఁబడినది. నేను శూరుండనుగానా? నేనుబట్టి కట్టివేయుటకు నేమియభ్యంతరమున్నదని సంతోషంబునఁ దనయుత్తరీయం బాగుజ్జంబు కంఠంబునకువేసి గట్టిగబిగించి చేరువనున్న యొకవృక్షంబునకుఁ గట్టెను.

సీత—ఇట్టియకార్యము కూడదని మీరైన నివారింపక పోయితిరా ?

నిమి—మేము మాత్రమూరకుంటిమా ? బల్లిదులగు నగరవాసులచే బగనుగొనుట యడవు లవెంబడి బడుగులవనుపునఁ దిరుగుచుండుటఁ బాడియా ? నీవాత్రమునఁ దడి నిత్తటినే వదలి పెట్టుము. లేనిచో దానియధిపతి సేనల సంకేతము గోడగుని శక్తివంచనలేక పలు మాఱులు బోధించితిమి.

సీత—అట్లుబోధించినను వినలేదా ?

నిమి—ఏలవినును ? జ్వరపీడితునకుఁ బంచదారఁబోలె మా బోధనలు రుచింపకపోవుట చేతఁ గృతఘ్నునకొనరించిన యుపకృతులంబోలె నిరర్థకంబులయ్యె. మాశాంతస్వభావం బును గనజాలక పిఱికివారినిగా భావించి "రాజానుజుండు శత్రుఘ్నుండు లాంటి! మీస్వాంతంబు లనావంతయేనియు వంతనొందకుండు. వాల్మీకిమహాముని ప్రసాదాసాదిత వీరమహే శ్వరమంత్రప్రభావంబున మనకుఁ జతుర్దశ భువనంబులయందును నజేయంబెయ్యది, అలభ్యం బెయ్యది" యనుచు నుల్లంఘించెను.

సీత—(ఆతురముతో) తరువాత నేమాయెను?

నిమి-తరువాతనోతల్లీ! శత్రుఘ్నుఁడో యనేకరథగజతురగపదాతిబలంబులతో శాత్రవబలదవ ప్రభంజనులగు సైనికులతోడను రథగజాశ్వ పదాతిబలంబులతోడను సరిదెంచెను. అప్పుడొక్కదండనాయకుఁడు "మాసార్వభౌమాజ్ఞంబులత్తడి నీతరువునకుంగట్టి వద్దుండగీఁడెవం,, డన నంత లవుండు దండతాడిత భుజంగంబుపగిది మండిపడి "యో రీమూఢా! రూక్షేక్షణవీక్షామాత్ర పలాయితవిపక్షుపక్షుండగు లవుండ. నేన. భవ దాజ్ఞయాజ్ఞీయాశ్వం బిచ్చట నావలం గట్టితి. రామునకున్నఁ బట్టుఁడని వ్రాసియుండె ను గదా! శూరుండనో భీరుండనో! ఇంకేమి యాలస్యము? రణంబొనర్చిన మదీయ నిశితాశు గంబులె చెప్పెడి,, నని స్పష్టంబుగఁ బలికెను.

సీత-(తనలో) తండ్రీ! లవా! నీకీబలవద్విరోధమేటికి? నీవాఁడియ యెంత అందిప్పుకున్నయు నికి యెట్టిది? నోటికివచ్చినట్టులన్నను ప్రేమచేసిగమాగను సారవిలోకియగు వాల్మీకి యూరకుండెనుగాని యెుగలుసైఁచెదరా? (ప్రకాశముగా) మునికుమారా! పదంపడి

నిమి-పదంపడి నోమాతా! ఆపలుకులు వీనులకు ములుకులవలెఁ దోఁప సేనాని ప్రళయకా లంబున నాలోకానలంబున లోకంబులు భస్మీభూతంబుసేయు మృగునిభంగి నుగ్రుం డయ్యు నర్భకుండని యంతలోఁ గరుణాస్వాంతుండై "బాలకా! యేలయీలీలఁ గ

ర్యక్షంబుచందంబున నీకుమారునిపయికి నుఱికి సవ్యాపసవ్యంబులుగా నర్ధేందు ప్రదరంబుల ఫాలంబున నేసి సోలింపఁజేసి బ్రహ్మాండంబుపగులునట్లుఁ బెద్దపెట్టుగాఁ గ నార్చి కాందిశీకులయినవారిని మరలఁబురికొల్పెను.

సీత—(భయముతో) తరువాత?

నిమి—ఇట్లుపురికొల్పబడినసయిన్యంబు తన్ను ముట్టడింప నావంతయేనియు నైసర్గికధైర్యంబుదొఱంగనీక నీకుమారుం డాకుమారునికరణి మెఱసి భానుఁబట్టడాయుస్వర్భానుపగిదిఁ బరిపంథినిడాసి సరథ్య రథిసారథికంబుగా రథంబునెత్తి యెగరవేసి గాలిపటంబులీలఁ జదలఁమెదలఁజేసి కట్టకడకుఁ జూర్ణచూర్ణంబుగాఁజేయ విరోధివరూథిని బెబ్బులిఁగన్న లేడికొదమలపిండుకయివడి వెన్నిచ్చిపాఱెను. సేనాపతి చచ్చెను.

సీత—(సంతోషముతో) బాగు బాగు. తరువాతఁ దరువాత?

నిమి—తరువాతనో దేవీ! ఇట్లు బలంబుపలాయనంబగుటయు దండనాయకుండు దండధరునిదండకరుగుటయుఁ గని భూపాలుండు తోఁకద్రొక్కినత్రాచువలె మండిపడి చక్రధరుండయిన హరికరణి శూలధరుండయిన శంభునిభంగిని దేజరిల్లి క్ష్మాభృత్పక్షవిచ్ఛేదంబునకు లేఖర్షభుండు దంభోళినెత్తినట్లు హస్తగృహీతకౌక్షేయంబు నీ సూనునిపయికెత్తె.

సీత—(భయముతో) హాతనయ! దండనాథునిగెల్చినసంతోషం బుర్వరానాథుని నల్చిన పిదపఁ గదా స్థిరంబుగానుండుట. ఇట్టిపట్ల మీతండ్రియే కాపాడవలయును. తరువాత?

నిమి—తరువాతనో తల్లీ! అల్లెత్తినకత్తిని దుత్తునియలుగాఁజేసి యతినిశితబాణపరంపరలచే విపక్షువక్షంబు గవాక్షంబుచేసి తురంగంబుల భంగంబులుగావించి సారథిం ధాడణిం ద్రెళ్ళనేసెను.

సీత—(సంతోషముతో) పట్టీ! నీయట్టివానిని గనుటచే నేను నిజముగా వీరసువునే నిమీ! పిమ్మట?

నిమి—పిమ్మట నోయమ్మా! అంతనాభూకాంతుండు నితాంతామర్షణస్వాంతుండయి ప్రళయకాలభాస్కరుండో యన భాసిల్లి మహీధరోపరిభాగంబునుండి మహికిలంఘించు పంచాస్యంబుభంగి శతాంగంబునుండి నీతనయునిపయికినుఱికి "డింభకా దీనిచేత

కృతాంత నిశాంతాతిథి వయ్యెద" వంచు దివ్యాస్త్రంబు ప్రయోగింప లవుండు "తన సోదరుండగు కుశుండు లేఁడయ్యె. ఉన్న నీ దివ్యాస్త్రం బుపసంహారంబు సేయునుగదా! అతఁ డిప్పుడువచ్చుతఱిగా" దనియేమేమో తలంచునంతలోనే యహితుని యాస్యంబు వికసింప మాహోములు ముకుళింపఁగాఁ దదస్త్రమహత్త్వంబున దిమ్మదిరిగి సొమ్మసిల్లి పుడమిపై వ్రాలెను.

సీత—(హాతనయా) లవా! నాకు దూరమైతివా? విడిచిపోయితివా?

నిమి—అమ్మా! ఊఁఱడిల్లుము. తరువాత నెత్తుటదోఁగియున్న లవుని లవంబైన భయంబులేక తనరథంబుపై నిడుకొని పోవుచున్నాఁడు.

సీత—హాముద్దులతండ్రీ!

చ. కలకలనవ్వుమోముఁగని కమ్మనిముద్దును బెట్టుకొందు రే
ఖలజనులైన నట్టినినుఁ గార్ముకపత్త్రిని గొట్ట నెట్టు చే
తు లరికి నాడెఁ జిత్తమెటుదోఁచెను గిరముమీఁద ఖడ్గమే
పలువ దలంచు నెత్తుటకుఁ బాపము ఘోరము నాక పుత్త్రికా.

చ. బుడుతతనంబునం దఖిలపూర్వసుపర్వులగీటడంచె నె
వ్వఁడో గడెలోన లీల నలవాలిబలంబును దూలఁజేసె నె
వ్వఁడో శిలకట్టఁగట్టె ఘనవార్ధికి నెవ్వఁడో యట్టిరాముపు
త్త్రిఁడవయి యొక్క శాత్రవుని దోర్యుగమందునఁ జిక్కినాఁడవే.

ఓ దైవమా! మా లవునికప్పుడే నూరేండ్లు నిండించితివా?

ఉ. భోగములేకపోయినను బూర్వపుభాగ్యము లేకపోయిన
న్బాగుగనున్న నందనులు నాకదె వేలునులక్షలంచు నే
నూఁగుచునుండ సంతతమునుయ్యేలఁ బుత్త్రికశృంఖలంబులన్
లాగుచుఁ ద్రెంపితందొకటి లక్షణమే యిదినీకు దైవమా.

హా తనయా! సుజనవిధేయా!

ఉ. అమ్మరో తమ్ముఁడేడియని యన్న కుశుండడుగంగ నేరితో
నిమ్మగ నాటలాడుటకు నేగితివంచని తెల్పుదాన నీ
విమ్మహి దర్భలాకులకు నెచ్చటికేగితివందుఁ గద్పుదు:

ఖమ్ములను నగ్నిఁ గొంగునను గట్టినయట్టుల నెట్టు దాఁచెదన్.

హా లవా!

చ. శరమును బూన్మునాట ఖలశాత్రవుఁడేసిన కాలమందు సో
దరుఁ గుశు నెంచి నీ వెటులఁ దల్లడమందితొ యమ్మ యంచు నే
సరణి నిజీరితో చదువుసంధ్యలఁ జెప్పిన తాత కావవే
సరగున రావె యంచెటుల సారెకు సారెకుఁ గేక పెట్టితో.

నిమి.— తల్లీ! చింతిల్లకుము. శాంతింపుము.

సీత— హా లవకుమారా!

చ. వనములఁ గిష్టమొందఁ బతి పంపిన మిమ్ములఁ జూచి యేడ్పుఁ జం
పి నిఖిలమీ రెగా యనుచు మీపయిఁ బ్రాణము లైదు పెట్టుకొం
టి నికను దేనిఁ జూచుకొని నే బ్రదుక న్గలదాన నీ మొగం
బును గనకున్న నన్న లవ భూతలమేటికి వేయి యేటికిన్.

తండ్రీ! ముద్దులయ్యా! నిలువెల్ల దహించుచున్న యీ పుత్త్రశోకవహ్ని నెట్లు భరిం
తును? కుశుఁ డింకను రాఁడయ్యె. అతఁడు వచ్చి యీ వార్త విన్న నెంత విచారపడునో?

కుశు— (ప్రవేశించి) ఎడమకన్ను దరుచున్నది. కారణ మేమయి యుండవచ్చును?

సీ. నిగమాగమంబులు నిరతంబు చదువు సం
యమి బాలు రేలొకో యాఁపినారు
మోమువంచుకొనుచు మునిచంద్రు లేలొకో
చేయి గడ్డము క్రిందఁ జేర్చినారు
కనుచూపుమేర నే కన్గొని పైఁబడఁ
గను తమ్ముఁ డేలొకో గానరాఁడు
అదిగొ మాతండ్రి యంచాస్యంబు నెంతొ నే
సెడు తల్లి యేలొకో చేరకుండెఁ

తే. గీ. బర్ణశాల యేలొకొ తొంటి భంగి గాక
కరగు వెలవెలబాఱె నీకంటె నీరు
వరదవలెఁ బాఱుచుండె నెవ్వారికేమి
సిలుగు కలుగలేదుగద యోచిన్మయాత్మ.

కారణంబేమో మాయమ్మగారి నడిగెదను (సమీపించి) అమ్మా! యేలయీలీలఁ దల్లడిల్లుచుంటివి? నేనుగాని నాతమ్ముఁడుగాని యేయల్లరిపనియైనను జేసితిమా యేమి? తమ్ముఁ డెక్కడ?

సీత — ఇంకను దమ్ముఁ డెక్కడ?

కుశ — ఏమీ నాతమ్ముఁడే లేఁడా?

సీత — తండ్రీ! కుశా! అరణ్యంబునందొక్క క్రతువాజిని బట్టుకొని యొక చెట్టునకుఁ గట్టివేసెనఁట. దానిచే ధరణీధవుండు కుపితమానసుండై నిశితాశుగంబులచే నీసోదరుఁ బిలుకుమార్చి శతాంగంబు పైనిడుకొని పోవుచున్నాఁడఁట. ఈకడుపుమంటను జల్లార్చువారెవ్వరు?

కుశ — తమ్ముఁడా! మదాజ్ఞాపరిపాలనకుతూహలోపేతా! నిజబలవిజితఖద్యోతా!

మ. అనిలోనన్ బటువిక్రమక్రమముచే నాదిత్యునిర్జించియా
తనిచే నస్త్రపరంపరల్ గొనిన నీదర్పంబునుంబాసి ద
న్యునిచేఁజిక్కి నవాడవే జననికిన్ శోకంబు సంధిల్ల నో
యనుఁగుందమ్ముఁడ నన్నుఁబాసిచన న్యాయంబౌనె నీకకటా.

ఉ. ఆటలచేనొకింత తడవైన గృహంబునుఘూర్ని చేరకె
చ్చోటికిఁబోయిరో యనుచు స్రుక్కుచు దిక్కులనెల్లఁ జూచుచే
మాటనువిన్న నద్దిమనమాటని యెంతయుఁ బొంగి కానిచో
గాటపుఁజింతఁ గ్రుంగు శ్రితకల్పకవల్లిని దల్లిఁబాసితే.

హా తమ్ముఁడా! లవా! నన్ను నీతోడఁ దీసికొనిపోవా?

ఉ. పుట్టుటనొక్క గర్భమున భోగములొక్క విధంబుగాఁగఁ జే
పట్టుట నొక్కయొజ్జకడ బత్తిని విద్యలనెల్ల నేర్చుటల్
గిట్టిన గిట్టఁగావలయు నీవును నేనును నొక్కవైరిచే
నొట్టును బెట్టినట్లు మనముండినఁ బోయిన సీతకాస్పెగా.

(కోపముతో) ఓరీపరిపంథీ! మూఢా! ఏమిపౌరుషమని బాలునొక్కనిఁ జంపితివిరా?

శా. ఓరీ నిన్ను మదీయబాణములచే నోడింతు యుద్ధంబునన్
శ్రీరామాధవుడడ్డమైనను భవచ్ఛీర్షంబు ఖండింతు దు

ర్వారాస్మద్భుజలేలిహానములచే బాధింతు నాసోదరున్
బోరన్గూల్చితి వీకుశున్ మఱచినావో కష్టముష్టింపచా.

చ. అని లవబాలునిన్ గెడపి యాతనిమాతకుఁ బుత్త్రశోక మి
వొనరిచి యెవ్వ రీడనుచు నుబ్బెదవే పెనుకండకావరం
బు నడిపి హానుతాయనుచు బోరునగోలను బెట్టఁజేతు నీ
జనని జూడు మీకుశునిసాహస మెట్టిదియంచు నెంచితో.

**సీత**—హాతండ్రీ! లవకుమారా!

ఉ. ఇక్కడనున్నపండ్లు తిని యెట్టులెటోపడియుండలేక నీ
వక్కడకేగనేల సవనాశ్వముఁబట్టఁగనేల కూడదం
చక్కటికంబుచేత హితులాడిన వాక్యము మీఱనేల నీ
కెక్కడనుండిమిత్తివలె నీతురంగంబిటు దాపరించెరా.

చ. సమయమదప్పెఁగాన మునిసద్మమునన్ దల దాఁచి పండ్లఁ బ
ర్ణములను బొట్టనింపుకొని నాలుకగల్గనివారిభంగి వా
రములను గడ్పి కీవిటులఁ బ్రాంచదవక్రపరాక్రమక్రమం
బమరఁగఁ జూపి కెండకనువయ్యోడిచ్ఛ్రతిముఁ బట్టవైతివే.

పౌరుషంబును జూపుపాటిభాగ్యమే మీకున్న నాధునిచే నట్టడవికిఁబంపఁబడిన నాకుఁ బుట్టనేబుట్టరు.

**కుశ**—అమ్మా! శోకింపకుము. ఊఱడిల్లుము.

**సీత**—ఊఱడిల్లుటయెట్టులురా? తండ్రీ! హాముద్దులపట్టీ! లవా!

సీ. ప్రొద్దుప్రొద్దునలేచి బువ్వఁబెట్టుమటంచుఁ గాళ్ళకడ్డమెవండు గదియవచ్చు
నదిపెట్టుమిదిపెట్టు మమ్మాయనుచెవండు మాటిమాటికి బతిమాలవచ్చుఁ
గుశునికంటెను ముందుఁగూర్చు నాకంచెవ్వఁ డన్నిటికిఁ దగవులాడవచ్చు
గాంతుని కేఁగుండఁ గన్నీరుదుడుచు చెవండేడ్వకుమంచు వనటఁబుచ్చు
తే. గీ. గడియగడియకుఁ గ్రొత్తగునడల నడచి
యెదకు నొక యింతసంతస మెవఁడుగూర్చు
ముఱిపెములు ముచ్చటలు నింక మూలఁబడెనె

ముకు—పచ్చలాఅని యట్టి ముద్దుఁగుఱ్ఱ.

తండ్రీ! నీయకాలమరణంబున కేదేవుఁడైన నడ్డపడక పోయెను.

ఉ. లేకయులేకపుట్టితని లీలఁ దొడల్ పయినిన్ను బెట్టి వా
పోకని యుగ్గుపోసి నెఱబొజ్జను మెల్లఁగదువ్వి యావలన్
నీకరయుగ్మమెత్తి కడునెవ్వఁగఁబాపెదు జేసికంటిజే
జేకిదె జోతఁజేయుమనఁ జేసితివద్దియు సాఁకదడ్డమై.

కుశు—అమ్మా! చింతింపకుము. నీదుఃఖంబును నేఁజూడఁజాల.

సీత—ఓ దైవమా! నలువురిలోపలఁ దలవంపులుగా నిరాపనిందను దలమీఁద వైచితివి. ధవునాజ్ఞచే నట్టడవిలోనుండునట్లు చేసితివి. అవిచాలక భరింపరాని యీ ముప్పొకటి తెచ్చిపెట్టితివి. ఇంతటితో నీకసిదీఱెనా?

తే. గీ. కష్టములపరంపరచేత గాసినొందు
వెలఁదినన్ను దైవముపాతల్ పెట్టుచుండె
శ్రోణిభారంబున నలయుకుండలీంద్రు
పైనవెన్నుండు పవళించుభంగిఁదోఁచె.

కుశు—తల్లీ! శోకిల్లకుము.

చ. కలనను బోరిపోరి శ్రమగాంచుట నొక్కెడనత్తమిల్లెనే
మొలవుఁడు చావఁబోఁడు వినుమోజననీ యనుజుండు గాఁడె నా
కలఁతియె వాఁడు తాల్మిదుగనిసంతనె కుండలియంచుఁ బాలుపా
రులు వచియించినట్టినుడి రూఢియె నమ్మఁగ వెఱ్ఱిదానవే.

ఉ. గాసిలినాఁడఁ గావుమని కాళ్ళపయింబడకున్న యుద్ధమున్
బాసి దొలంగకున్న రిపుఁబట్టివధించెదఁ దాత్రపాణముల్
బోసినఁ బోయనిమ్ముపుడ పోయెద డాసెద రుద్రుఁడడ్డమై
బాసటపడ్డ నే విడువఁ బౌరుషహీనత వీరధర్మమే.

చ. కనులనుగానకెవ్వఁడు పగఱ్ఱొని నీముఱిపెంపుఁగుఱ్ఱి నా
యనుజుని గెల్చె నా తులువ నానయహీనుని నంతకాలయం
బునకిదె పుత్తుఁ గావునను బూర్ణకృపామతిచేత విల్లు న

మ్మను స్పృశియించిదీవన లమోఘముగాఁగ నొసంగిపంపుమా.

సీత — లవునివిధంబునిని నిన్నంపవలెననియున్నను శత్రువునిదలంచి నా హృదయము కంపమొందుచున్నది. జయమెవ్వరికగునోయని సంశయము కలుగుచున్నది. సంశయమేల? నీటముంచినను పాలముంచినను మీతండ్రిదేభారము.

తే. గీ. జగతి మీజనకుఁడు సత్యసంధుఁడేని
భర్తయందు నాచిత్తంబు పాయదేని
ధర్మమందున దైవంబు దప్పఁడేని
గలన వైరులఁగెల్తువుగాక కుశ.

కుశ — మహాపతివ్రతాశిరోమణివైన నీయాశీర్వాదంబుండ నాకేమికొఱంత?

ఉ. మాకిమసంగినట్లు రిపుమండలి గ్రమింగెద నాదుతమ్ము నీ
కూరిమికుఱ్ఱఁదెత్తు నిదిగో యటుసేయకయున్న నన్ను నీ
పేరునఁబిల్వఁబోకు నిజవృత్తము నేనును జెప్ప గెల్పునే
నారసి వెన్క మీకొడుకునంచు వచించెద లేకయేటికిన్.

అమ్మా! తడవయ్యె. సెలవుగైకొనియెద. వందనములు.

సీత — సమరవిజయప్రాప్తిరస్తు. నీకు జయంబు చేకూర దేవదేవు నారాధింపఁ జనెద. నీవు సమరమునకుఁ బొమ్ము.

(ఇద్దఱునిష్క్రమింతురు)

శ్రీరస్తు.

# కుశలవనాటకము.

## పంచమాంకము.

### యజ్ఞశాల.

(రాముఁడు, భరతుఁడు, వసిష్ఠుఁడు, ప్రవేశించుచున్నారు)

**రాము**—భరతా! ఇంకను సవనాశ్వంబు రాదయ్యె. కారణంబేమి?

**అమ**—(ప్రవేశించి) స్వామీ! రక్షింపుఁడు రక్షింపుఁడు.

**రాము**—ఎవఁడవురా యార్తుండవై దీనాలాపంబులాడుచున్నావు?

**అమ**—ఆర్యా! నేను భవదనుజన్మకింకరుండను. అమరకుండనువాఁడను. ఘోరంబగు దురంబునఁ గరంబు బీరంబు సెడి వచ్చితిని.

**రాము**—మదనుజాతపరిరక్షితుండవగు నీకు భయమేమి? శత్రుఘ్నుండొకఁడు మునితనయు నశ్వనిరోధకుని జయించి వచ్చుచున్నాఁడని వింటిమి. సంగరభారసంజనితాయాసుండగు నతనికిఁ దోడుగా లక్ష్మణునికూడ పంపితిమి. వారి సమరసమాచారములెవ్వి?

**అమ**—అయ్యా! అవధరింపుఁడు. అట్టిలాతలంబున మూర్ఛిల్లినముని శాబకునితోఁ బరవర్ప ఘ్నుండు డగు శత్రుఘ్నుండు వచ్చుచుండఁగా నతని సోదరుండొకఁ డాగ్రహోదగ్రుండై రెండవదండధరునికరణి మెఱసి భుజంగంబును డాయు గరుడునివడువున డాసి "ఱో పరిపంథీ నా యనుజాతుండని శంకింపక మూర్ఛిల్లఁజేయుటయే గాక స్యందనంబుపై నిడుకొని పోవుచుంటివా? ఇంకెందుఁబోదువు? అవక్రపరాక్రమక్రమనిర్మథితాహితచమూసమూహుండ నగు నేనిదే వచ్చితి. అనికిం జొచ్చితి. దండధర

ప్రచండదంష్ట్రాంతరంబులఁ జిక్కినవానికైన మరలుటకలిగినం గలుగునుగాని పోరనాబారిపడి పాఱువారెవరు లేరు లే" రని విలయకాలభీషణగర్జితంబు కైవడిఁ గేకపెట్టుచుఁ బిడుగులకంటె బెడిదంబులైన ప్రచండకాండంబులఁ దండోపతండంబులుగాఁ గుప్పి శతాంగంబుల భంగంబుచేసి ఘోటకంబుల గీటడంచి యేనుంగులఁ బీనుంగులఁ జేసి పట్టరానిమదంబునఁ బ్రహ్మాండంబులు బ్రద్దలగునట్లు పెద్ద సింహనాదంబు చేసెను.

భర—మునిబాలకుండేడ? ఇట్టిసాహసమేడ? ఆశ్చర్యముగానున్నది.

రామ—ఏమియీమాణవకుని శరవిద్యానైపుణ్యము? తరువాత తరువాత?

అమ—అంతశత్రుఘ్నుండు నితాంతక్రోధఘూర్ణితమానసుండై సంవర్తసమయద్వాదశార్కుల చందంబునఁ గేజరిల్లుచుఁ బుంఖానుపుంఖంబులుగా శరంబు లరిపైఁ గురిపి యొడలెల్ల జల్లెడోయనఁ జిల్లులుపడునట్లు చేసెను.

రామ—(సంతోషముతో) బాగుబాగు. లవణారిముందఱనా వీనియాటలు సాగుటకు? అమరకా! తరువాత? తరువాత?

అమ—తరువాతనో దేవా! అంత నమ్మాణవకుండు కనలి కన్నుల నిప్పులు రాల్చుచుఁ బరప్రాణాపహారిణియగు నొకశక్తిం జేతఁబూని "నా మాత వీరసాధ్వియగు నేని దీనిచే శాత్రవుండు సమయుఁగాత" మని ప్రయోగింప శత్రుఘ్నుండు చెయ్వులేది స్థండిలశాయియయ్యె.

రామ—(విచారముతో) హా యనుజా! శత్రుఘ్నా! మత్సేవనార్థంబుపోయి నీజీవము గోల్పోతివా? ఎట్టిపాడువేళ నిన్నంపితినో కదా! నీ చావునకే యాగంబును జేయనెంచితి గాఁబోలు?

మ. దురమందుం లవణాసురాదిరిపులన్ దుర్జేయులన్ గెల్చి నా
సరసన్ జేరఁగ భాగ్యమేమియని హర్షంబొందితి న్నాని యు
స్థిర మాహర్షమటంచు నెంచనయితిన్ సేమంబులోనుండ గో
చరమా నా నిజభావికాపదలు హా శత్రుఘ్నుఁడా తమ్ముఁడా.

లవణాసురాఖర్వగర్వనిర్వాపణక్రియాచాతుర్యధౌరేయ! శత్రుఘ్న నామధేయ!

ఉ. రాముఁడొకండు కోసలధరావరజాతకు నట్లుమాండవీ

కాముఁడొకండె పుత్రుఁడయి కైకకునుండఁగ నీకు లక్ష్మణుం
డీమహిఁ జాలఁడే యొకఁడ యేనిక నెందులకమ్మయంచుఁ బో
తే మతిరానితావునకు దిక్కెదిరా శ్రుతకీర్తికకటా.

భర— అగ్రజా! మరణముకాదు. మూర్ఛయైయుండవచ్చును. తొందరపడెదరేల? ఆవలి కథను విందము.

రాము— అమరకా! అప్పుడచ్చటికి లక్ష్మణుఁడు రాలేదా?

అమ— ఇట్లు శత్రుఘ్నుం డిలాతలంబున వ్రాలినతక్షణమే యూర్మిళాకాంతుండే తెంచి యవనిం ద్రెళ్ళిన యనుజునిగూర్చి కొంత ప్రొద్దు విలపించి యంతట వివేకంబున శోకంబున కిదియదనుగాదని యెదనెంచి విశేషరోషభీషణుండగుచుఁ జిచ్చుకన్ను తెచివచ్చిన హరుండోయనన్నొప్పి హాలాహలసదృశంబులగు క్రూరనారాచంబుల లక్షోపలక్షలు విపక్షవక్షంబుమీఁదఁబరపి లతాంతాక్రాంతాశోకవసుధారుహంబోయనరక్తసిక్తాంగునిజేసి "బుద్ధివచ్చినదా? మచ్చరంబు నిప్పచ్చరమయ్యెనా?" యనిగ్రుచ్చిగుచ్చి గేలిచేసెను.

రాము— బాగు. లక్ష్మణ! బాగుబాగు. నీయట్టివాని కసాధ్యంబేది? అమరకా తరువాత.

అమ— తరువాత నోప్రభూ! మున్ను మూర్ఛిల్లిన మునిబాలుండు నిద్దురనుండిలేచినట్లు లేవ నాసోదరు లిద్దఱు నితాంత సంతోషాక్రాంత స్వాంతులై యనలానిలులోయనఁ దనరి చెలియలి కట్టనుదాఁటివచ్చుకడలి వడువున సైన్యంబు నాక్రమించి యశేష పరుషభీషణభాషణంబులచే దూషించి భూరిసంజ్ఞామాత్రంబున మరలించుటయు భవదనుజన్ముండు "నేనుండ మీడెందంబులందుఁ గొందలమంద నేల? రణంబున వెన్నిచ్చి పాఱుట వీరధర్మంబుగాదు. నేఁడు పందలై డాఁగిన నచ్చట మృత్యువు లేకున్నె" యని పురికొల్పుటయు నంతసైనికులు సంఘంబులై మాతృగర్భంబునందలి యర్భకు నిర్భరంబుగాఁ గప్పుమాయాతమంబునుంబోలె డింభకుల సంరంభంబునఁ గప్పుటయు నంతవారు మేరుమహీధరంబుమాడ్కిఁ జలింపకసుజ్ఞానదావానలంబునఁ గామ క్రోధ వికారారణ్యంబును భస్మీభూతంబును జేయు పరమహంసభంగి ధైర్యభానోదయంబున నత్తమంబును బాపుకొనుటయుఁ దటస్థించె.

రాము— ఏమి యీయాశ్చర్యము? బాలురయ్యు నందుఁబాలులయ్యు నెట్టి పరాక్రమ

వంతులు. వారిని గన్నతల్లి యేనోములు నోఁచినదోగదా! అమరకా! పదంపడి.

అమ—పదంపడి నోస్వామీ! కాలజిత్తు లక్ష్మణునకును దమ్ముఁ డన్నకును సహాయంబు గాఁగఁ బరస్పరజయాభిలాషలచే నంతకంతకు రణంబు దారుణంబై సుమిత్రానందనుని చే వారి బాణంబులు ధనువులు సకలాయుధంబులు రథంబులు మనోరథంబులతోఁ బాటు భగ్నంబులయ్యె.

రామ—పిమ్మట?

అమ—పిమ్మట నోదేవా! అంత నబ్బాలురు కరణంబులులేక రణంబునఁజేయునదిలేక రెక్కలు తెగిన పక్షులచందంబున ఫణంబులు నలియఁగొట్టఁబడిన ఫణులభంగిఁగరములు లేని కరులకరణి నొక్కచక్కనొదిగి భక్తియుక్తి బద్ధబాంధవు నారాధింప నతండు ప్రసన్నుండై యనన్యసామాన్యంబులైన చాపంబుల రోపంబుల వారికిచ్చి తిరోహితుండయ్యె.

రామ—భాస్కరా! తమోతిరస్కరా! ఎంత తెలివితక్కువపనిచేసితివి? ఒక్కయేఁడు పైఁబడినకొలంది బుద్ధిమందగించుచున్నదాయేమి?

తే. గీ. అకట! మిత్రజగద్బాంధవాఖ్య లరుల
యందుఁ దపనాఖ్యమాయందు నమరనిల్పి
స్వకులజాతులఁ జంపంగ శాత్రవులకు
ధను వొసంగితే మదియేది ధర్మమేది.

భర—అగ్రజా! శక్తిహీనులకుఁ బరికరంబులున్ననేమి? లేకున్ననేమి? దేహబలంబును మనోబలంబును హస్తలాఘవంబును నుండవలదా? “జ్ఞాతిశ్చేదనలేనకి” మ్మను దానికి బుజువుగా నారవిగాని గివిగాని వారికేమైన నిచ్చిన నిచ్చుంగాక. సౌమిత్రిముందవి యక్కఱువచ్చునా?

రామ—అమరకా! అటుతరువాత.

అమ—తరువాత నో దేవా! నక్రతిమింగిల ప్రముఖ జలచరాఢీలంబైన పారావారంబు ననుకరించు రథ గజ తురంగ పదాతిసమేతంబైన సైన్యంబును మునిబాలద్వంద్వనామకమై నాకమందరంబులు గలంచిధ్వనులు విష్ణుపదంబును ముట్టునట్లు చేసి లయకాలాభ్రంబులట్లు గర్జిల్లుచు సునాసీరశరాసనంబులీల బాణాసనంబులు ప్రగాల శరధారాసారంబుగురిపించి క్షణంబులో శత్రుసమూహంబును రుధిర ప్రవాహంబుల

యందుఁ గొట్టుకొనిపోవునట్లొనర్చె.

రామ—తరువాతఁ దరువాత?

ఆమ—అప్పుడు లవణాసురమాతులుండగు రుధిరాక్షుండను వాఁడు నిజదానవ మాయా బలంబున నంసుజ్యేష్ఠునని ద్వాదశాత్మదత్తంబైన ధనువుగొని యుప్పరంబునకు గుప్పు ననెగయ నతండు వానినీడకొరాయన వెంటనంటి సమవర్తి సంహార సంరంభుండగు శంభునిభంగిఁ బోయి "మున్నీటమునింగినను జిచ్చునను జొచ్చినను నిన్ను బాణంబులతోడ వీడ" ననుచు దశదిశలు చెవుడుపఱుప నార్చుచు దఱుముచుండఁ గాంచి హృదయంబుల సాధ్వసంబు సంభవింప "నితండెవరిమీఁది కొరగి రూపుమాపునో" యని యాత్మప్రాణత్రాణపరాయణులై యేనుంగులపీనుంగులమాటున నోడలెల్ల ముడుచుకొని కూర్చుండువారును శతాంగంబుల చక్రంబుల మఱుంగున నోరు మెదలపక యొదుంగు వారును గుఱ్ఱంబుల కళేబరంబులఁ జిందుకొని యాపాదమస్తకంబుగా ముసుంగువేసు కొని మూలలనుండువారును బ్రతికియుండిన బలుసాకు దినవచ్చునని కాలికొలంది నలు దెసలకుఁ బాఱువారుఁగలదియై సైన్యంబు సమరంబునుండిపాయ లక్ష్మణుండు వీరరస మిట్లుమూర్తీభవించెనోయనఁ బ్రజ్వరిల్లి రోషదశంబున నమ్మునిదారకుల కవచంబు లు చించెను.

రామ—తరువాత?

ఆమ—తరువాతనో ప్రభూ! అప్పుడు వారిరువురు నిర్ముక్తనిర్మోక దర్వీకరులగుచు వారు ణాగ్నేయ ప్రముఖ దివ్యాస్త్రంబులఁ బ్రయోగింప సౌమిత్రి ప్రత్యస్త్రంబులచేత నుపసంహరించుటయు నంత నబ్బాలు రాజ్యాశగప్రేరితంబైన వీతిహోత్రునిచందం బునఁ బ్రజ్వరిల్లి సకలశాత్రవ సంహారధురీణంబగు నొక్క శక్తిం బ్రయోగింప నద్ది మీ యనుజానురంబు బ్రద్దలుచేయ విస్మృతుండై నిస్తేజుండై యస్తమించుతరణికరణి న రదంబున నొరిగెను. నేను దెబ్బలుతిని చావుదప్పి యీవార్తనుజెప్పుటకుఁగాఁబో లు మిమ్ముఁజేరగంటిని.

రామ—హాతమ్ముఁడా! లక్ష్మణా! యజ్ఞమని పేరుపెట్టి మునిబాలకులకు ధారవోసితివా? శత్రుఘ్నునితోఁ బాటు నీవుకూడ నంతరించితివా?

మ. అనిలోనింద్రజిదాదిదానవుల సంహారంబుగావించి యి
మ్మనువంశంబునకెల్ల మండనమవై మాన్యుండవై పేరుఁజెం

డినసీపే మునిబాలుచేతఁబునఁ మీనీయున్నకుఁ దీఱితే
వనరాశిఁ దరియించి బోదెఁబడినావా తమ్ముఁడా లక్ష్మణా.

మ. సమరక్షోణిని గాలునూఁదినిలువన్ స్థాణుండొ శక్రుండొ శ్రీ
ప్రమదానాథుఁడొ యంచు నిన్ను బలవత్ప్రత్యర్థిసంఘంబు స్తో
త్రముసేయంగ ముదంబుఁగంటి నదియంతంబయ్యె నిర్భాగ్యచి
త్తమునేకై వడిఁబాయకుండును సుమిత్రానందనా తమ్ముఁడా.

హా సౌమిత్రీ

మ. పదునాల్గేండ్లుచరించి క్రమ్మఱ భవద్భార్యాసమేతుండ వ
య్యెదవంచున్ దనశోకమాపుకొనె మాన్నెయమ్మయాయమ్మతో
నెదగార్చిచ్చునుబేర్చు చందమున నేనీఘోరదుర్వార్తఁజె
ప్పనునే చెప్పకయుండుటెట్టులు పథంబున్ జూపరా సోదరా.

హాతమ్ముఁడా! లక్ష్మణా! ఎడతెగనిభక్తిచే మాయడుగులుగొలిచితివి. పల్లెత్తి మాఱుపలుకవైతివి. కట్టెదుట నిలువవైతివి. భగ్గుభగ్గుమని మండునగ్గిలో నుఱుకుమన్న ను వెనుకంజవేయవైతివి. నీయట్టివాఁడు నాకిఁక గోటిజన్మంబులెత్తినను లభ్య మగునా?

భర—అగ్రజా! మీరేల ప్రాకృతునిభంగి వాపోవుదురు?

ఉ. బాణపరంపరల్ పరపి వర్షముభంగి విపక్షుమీఁద గీ
ర్వాణనిభుండు లక్ష్మణుఁడు ప్రాన్పడియుండఁగవచ్చుఁ గాకనిన్
మాణవకుండుగాదు రిపుమారణఖేలన దక్షుఁడైన యా
స్థాణుఁడైయైన నేమి యతిసాహసు నాతని గెల్వఁజాలు నే.

ఇంతయనుమానమేటికి? ఒక్కటి యవధరింపుఁడు

తే. గీ. అమితబలుల రక్కసులనే హతమొనర్చి
నట్టిసౌమిత్రి కన్నులనైనవిప్పఁ
జాలనట్టిబాలురచేత సమయువాఁడె
సింగములగెల్చి లేడికిఁ జిక్కినట్లు.

వసి—రామా! భరతునివచనంబు నిక్కంబు. ఊరడిల్లుము.

రాము—హాతమ్ముఁడా! ఊర్మిళాజానీ! సుమిత్రాగర్భశుక్తిముక్తాఫలా! మేఘనాథ మద

కుండాల కంఠీరవా!

చ. క్షణమయిన న్ననున్విడువజాలకయుండుట నన్నుఁగూడి భీ
షణవిపినంబులందుఁ బడజాలనిపాటులనొందియుంట ద
క్షిణభుజమట్లతోడగుటచేఁ గవలోయననుంట రామల
క్ష్మణులని పల్కరంద ఱిఁక మామకనామమె పల్కసైఁతునే.

చ. అడవులకేగునాఁడు భవదంఘ్రిసరోజయుగంబు కప్పుడున్
విడిచిమనంగఁజాలనని వెంబడివచ్చితి విప్పుడేటికిన్
విడిచితి పోనివెంటఁగొనివెళ్ళినసోదరు నన్ను నీవు ని
ప్పుడు కృపవెంటఁబెట్టుకొనిపొమ్ము కృతజ్ఞతమీఱఁ దమ్ముఁడా.

భర—అన్నయ్యా! శాంతింపుఁడు. శాంతింపుఁడు.

ఉ. ఎట్టివిపత్సముద్రమున నిట్టటులూగుచునున్న భక్తినిన్
గట్టిగనెంచినంత దరిఁగాంచరె లోకులకెల్లఁ గొంగునన్
గట్టినయట్టిబంగరముగాదె భవత్పదపద్మసేవ నీ
యిట్టిమహత్వసంపదల నీవెయెఱుంగ విదేమిచిత్రమో.

రాము—హాతమ్ముఁడా! సౌమిత్రీ! ఇంకనాపాదుకన్నులకుఁ గనిపింపవా? నీకు నాకుఋ
ణము నేటితోఁ దీఱిపోయెనా? చెరియొక్కటెక్కనుబుచ్చుకొని శత్రుఘ్నుండు
ను నీవును నన్నుదుఃఖసముద్రంబులోఁ బడవేసితిరా? నాకు దరియేది? ఎట్టిదురదృ
ష్టుండను?

సీ. శైశవంబాదిగా క్షణమైన నన్నెడఁ బాయకవెన్నంటి వచ్చియుంట
నగరమందుండక నాతోడనే తెంచి కానలందిడుమలఁ గాంచియుంట
సమరరంగంబున శక్రజిత్తాదులన్ గినుక మదర్థమై గెడపియుంట
సీతావియోగంబుచే గాసినొందంగఁ జిత్తశాంతికి నేదొ చెప్పియుంట

తే. గీ. నిన్నుబోలినయవరజుం డెన్నిజన్మ
ములను నోత్తినదొరకఁడం చలరుచుండఁ
దుట్టతుదకు నీకష్టంబు పెట్టినావె
తమ్ముఁడా లక్ష్మణా సుమిత్రాకుమార.

భర—యజ్ఞవేదికాసమాసీనా! హోమధూమావిలశోణనయనా!

ఉ. నీటనొ పాలనో జనుల నీదయవచ్చినయట్లు ముంచు నీ
బోఁటిమహానుభావుఁడె సుపూజ్యుఁడె పామరుమాడ్కి నేఁడ్వ నే
పూఁటకుఁబొట్టకై వెతలుపొందెడువారికి లెక్క దంతు తే
యేటనుమున్గికొట్టుకొనియేగఁగ నక్కఱకుఁ బాటిరేవొకో.

వసి—రామా! ఊఱడిల్లుము. సౌమిత్రులకు మరణంబుగాదు. మూర్ఛయనితలంచెద.

రాము—అయ్యో. మీవచనంబు లీదుఃఖసాగరమగ్నునెడల నిరర్థకంబులు. నాకుడిభుజము పడిపోయెను. నాకింక లోకమే లేదు. ఈసవనదీక్ష లెందులకు? నలువురిమొగంబు లెట్లుచూతును? తలయెత్తికొని యెట్లుఁదిరుగుదును? బ్రతికియుఁ జచ్చినవారిలోఁ జేరితిని. అదిగోలక్ష్మణుఁడు నాకంటిలో మెలంగుచున్నాఁడు. హాసోదరా! సౌమిత్రీ!

చ. వనమునఁ దన్నుడింపఁ బెనుబాములగాసిలి సీత యెంతయున్
గనలుచు నిన్నుజచ్చెదవుగాకని కాఁక శపించియుండవ
చ్చు ననుజ గాకయున్న నిను శూరు రణావనిఁ గూల్పఁజాలునే
మునితనయుండు నాకనుజుండట నాయువు నీకు నిండునే.

ఓసీతా! ధరణీజాతా!

ఉ. అగ్రజుఁడాడినట్టినుడి కడ్డముఁజెప్పఁగలేక లక్ష్మణుం
డుగ్రవనాంతమందు నిను నుంచఁగ నాతఁడు తల్లిఁబాయ నీ
వాగ్రహదృష్టిఁ జూడఁదగ దాజ్ఞనొసంగినరాము వీని నే
నిగ్రహబుద్ధిఁజంపి యవనీసుత పుణ్యము గట్టుకొమ్మికన్.

ఓసచ్చరిత్రా! సుమిత్రా! తల్లీ!

చ. క్రతువనుపేర నీసుతులఁ గారణజన్ములఁజావఁజూచె దు
ర్మతిరఘురాముఁడంచనక భ్రాంతిలుపోయినదారిఁబోవు నా
మృతివినియేడ్చుమాజనని యెట్టెటొడగ్గఱి మీరలిద్దఱున్
ధృతిఁగనియూఱడించుకొను చెట్టులొయట్టుల నేడ్పుమానుఁడీ.

భర—అగ్రజా! మీరుప్రాజ్ఞులయ్యు నజ్ఞునిరీతి నంతకంతకు వెఱ్ఱినిబడుచున్నారు. సౌమిత్రులకేడ? మరణంబేడ? మూర్ఛయనినమ్ముఁడు. వారినిమూర్ఛిల్లఁజేసినబాలురు వధ్యులు. కావున

ఉ. చెచ్చెరనేఁగెదన్ రిపులఁజేరెద హుమ్మనివారితొమ్ములన్
వ్రచ్చెద రక్తవాహినులఁ బాఱఁగఁజేసెద గృధ్రకోటికిన్
ముచ్చటదీర్చెదన్ విజయమున్‌గొనివచ్చెద నాదుధైర్యమున్
మెచ్చి వియచ్చరుల్ విరులమేదినినెల్లెడఁ జల్లఁ బెల్లుగన్.

రాము—తమ్ముఁడా! భరతా! ఎంతవెఱ్ఱివాఁడవు? ఇంకనుమనకుజయమా? వినుము.

మ. బలఁగంబంతయురూపుమాసె మదవత్ప్రర్థినాశంకరుం
డలశత్రుఘ్నుఁడు వాసె లక్ష్మణుఁడె యన్యాయంబుగావించి పె
ద్దలయందైక్యమునొందెఁ గష్టదినముల్ దాపయ్యె సౌఖ్యంబికన్
గలలోనమ్మకు శ్రీలు మీవదినెవెన్కన్ బోయెరా సోదరా.

కాలముకానియప్పుడు మనమేమిచేయఁగలము? కావున

చ. మనకులమింతతోఁ బరిసమాప్తమునొందకయుండునట్లు తే
యనుపుననైననీవుమని యంతమునొందినయట్టివారికి
న్దనివిగ నీటిబొట్లనుదినంబు విడుర్పఁగదయ్య పాపపుం
దనువును బాసి నాయనుఁగుఁదమ్ములుపోయినదారిఁ బోయెదన్.

భర—అన్నయ్యా! ఇప్పట్లవిధిలేక పెద్దలకెదురుచెప్పవలసి వచ్చినది మన్నింపుడు. రిపులను జయించి యిహలోకసౌఖ్యంబు లనుభవింపవలయును. లేదా వారిచేతఁజచ్చి పరలోకసౌఖ్యంబులను జూఱకొనవలయును. ఈరెండుపద్ధతులుగాక మూఁడవది యుత్తమక్షత్రియుల కుచితంబుగాదు. ఊరకచచ్చిననేమి? సద్గతిఁగాంచవలదా? రిపుహతులైన సౌమిత్రులకుంబోలె నాత్మహత్యఁజేసికొనుమీకు నుత్తమలోకప్రాప్తి యెట్లులగును? కాకున్న వారి నెట్లు గలిసికొనఁగలరు? ఇంతియేగాక యాగంబుచేసినంగాని సద్గతికలుగదు. మఱియాగంబునకో తురంగంబువచ్చితీరవలయును శత్రునాశనముగాక తురంగంబురాదు. కావున నెటులైన శత్రునాశనము కర్తవ్యము,

వసి—భరతుఁడుపల్కినది లెస్సైనమాట.

రాము—అవును. చక్కఁగా బోధించెను. (కోపముతో) ఓరోరివైరులారా!

మ. మనుశత్రుఘ్నునిజంపి కోపదహనున్‌బుట్టించి నాయంతవా
నిని సౌమిత్రినిజంపి భగ్నమనిమండింపంగ మిమ్మిప్పు డిం

ధనరూపంబున వే గ్రహింపఁగనఁడే నాబోఁటివాఁడన్నయై
తనరన్ బాలకులార యీదినమె మాతన్ బాసిన ట్లెంచుఁడీ.

చ. అనుజులఁ జంపినారనుచు నంగుటమాదిగ నెత్తిదాఁక భ
గ్గుననొడలంతయు న్విడక క్రోధదవాగ్ని నిమందుచుండెఁ గా
పునరిపురక్తమున్ దనివిపో నభిషేచనమేను జేసికొం
దును ప్రియసోదరా భరత తూణము బాణముఁ దెమ్మ యిప్పుడే.

**భర**—చిత్తము. అటులనే తీసికొని యాయోధనవసుంధరకు వచ్చెద. మనమిరువుర మరులఁ దునుమాడుదము. సౌమిత్రులను దీసికొనివత్తము. మఘాశ్వంబును విడిపించుకొనివత్తము. క్రతువు నిర్వర్తికాంతము.

**రామ**—మంచిది రమ్ము. అమరకా! నీవుపోయి రథంబునాయత్తంబు సేయుము.

**అమ**—చిత్తము. (నిష్క్రమించును)

**రామ**—వసిష్ఠమునిచంద్రమా! తురంగంబు రాకున్న యాగంబు సాంతంబుకాదు. కావునఁ జెచ్చెరపోయి వచ్చెదము. మా నమస్కృతులంగొని యాశీర్వచింపుఁడు

(నమస్కరించును).

**వసి**—మీకు శుభముకలుగుఁగాక. పోయిరండు. మాకనుష్ఠానకాలంబాసన్నంబైనది. పోయెదము. (అందఱు నిష్క్రమించుచున్నారు)

శ్రీరస్తు.

# కుశలవనాటకము.

## షష్ఠాంకము.

### వనము.

(సవనాశ్వంబుతోడఁ గుశలవులు ధనుర్బాణంబులతోడ రామభరతులు ప్రవేశించుచున్నారు.)

రాము—సోదరా! భరతా! అదిగో మనమువిడిచిన సత్రహయము, దాని కుఱంగట నెవ్వరో యిద్దఱుబాలకు లున్నారు. నేనీచెట్టునీడ నొకింతకాలము విశ్రమించెదను. నీవుముందుపోయి బల్లిదులతోడ బవరంబా యని వారికిఁ బెక్కుభంగుల బోధింపుము నీబోధనలు రుచింపనిచో సమరంబున కుపక్రమింపుము. నేనువచ్చెద.

(చెట్టునీడను గూర్చుండును.)

భర—చిత్తము. తమయాజ్ఞాప్రకారంబున మెలంగెద. నేనిదేపోయెదను.

(ముందునకు నడుచును.)

లవు—అన్నయ్యా! కుశా! విపత్తుజీవకంజకుంజరా!

ఉ. తమ్ములచావుఁజూచి యిఁకఁ దాబ్రదుకన్ ఫలమేమియంచుఁ జి
త్తమ్మున నెంచివచ్చెడి నితం డనురక్తికి నిద్దికాదె సా
క్ష్యమ్మిటులుండఁగావలవదా మనతల్లికి వీరమాతృనా
మమ్మును వీరితల్లికా కుమారులశోకమునుండె నింతకున్

కుశ—అవును. అదియెట్లనువ్రాసియున్నది. కానినీనికిబుద్ధిగఱపి రణవిముఖుని జేయఁజూచెద. వినఁడేని యుద్ధంబునకు సన్నద్ధుండనయ్యెద. (భరతునిజూచి) ఓరీవైరీ!

ఉ. వచ్చినయట్టి సోదరుల చందముఁజూచియు బోరు సల్పఁగా
ముచ్చటతోడ వచ్చితివి మూర్ఖతనా నిఁక వేఱె యున్నదే
చిచ్చునుడాసి గర్వమున జీవములన్ విడు కీటకక్రియన్
జచ్చెదు తర్పణోదకముఁ జల్లఁగ సంతతికొక్కఁడుండదే.

ఖర—ఓరీమూఢా! ఆత్మభూషణపరదూషణపరాయణా!

ఉ. నింగిని నేలను న్గనక నీవిటు నోటికివచ్చినట్లు వా
గంగలకార్యమే మెవనిగా యనుకొంటివో నీవు నన్ను నో
వెంగలి చాలుఁజాలునిఁకఁ బ్రేలకు గ్రంథముఁగట్టు గడ్డిపోఁ
చం గదలింపఁజాలనియశక్తున కర్బుదముల్ ప్రగల్భముల్.

కుశ—ఓరీయహితా! నిజప్రాణహరణకుతూహలోపేతా! మావి ప్రగల్భములా? నీవి సత్యవాక్యములా? ఇందేవి సత్యమోయీసమరరంగంబుననే బయలుపడునుగాక. రమ్ము

లవు—ఇష్టమువచ్చినట్లుదూఱుటకాదు. అని యొనరుపవలయును. కాలహరణంబేలచేసెదవు? దురంబునకురాక తడసినచోఁ జచ్చిన నీతమ్ములను గలిసికొనలేవు. వారిదివఱకే కడుదూరమరిగియుందురు.

ఖర—(తనలో) కోపమా! ఒక్కఁటికాలము నాచెంతరాకుము. వీరుబాలురు. కావునవధియించిన లాభమేమి? నాశక్తివంచనలేక చతురుపాయంబులలో మొదటిమూడింటిచే రణము నివారించెద. అట్లుకానిచోఁ జతుర్థోపాయంబు నేనుపయోగింప నీవు రమ్ము. (ప్రకాశముగా) బాలురారా!

ఉ. అంటిరియేమియేమొ యవియన్నియు సైఁచెద నేనువిల్లల
న్గంటినిగానఁ జంప నదినాకునుమాత్రము దొడ్డకార్యమా
యింటికిఁబోయి చల్దితినుఁడీ యటుగా కనిఁజావఁ దిమ్మటన్
గంటనువత్తిపెట్టుకొని గాంచినఁ గన్నదువారె తల్లికిన్.

లవు—చీ. క్షత్రియానర్హంబులును బ్రాహ్మణార్హంబులునైన వచనంబు లుగ్గడింపుచున్నావు. తమకంటె నధికబలశాలులు వచ్చినప్పు డెట్టియాగ్రహచేతస్కులకైన నోరులుగఱపకయే పరమశాంతిగుణంబు సంభవించుననియు నప్పుడు చేయునదిలేక శాఖోపశాఖలుగా నిట్టివేదాంతంబులు పుట్టుననియు విననివారముకాము?

భర—ఓరీబాలుఁడా! నీబాగుదలంచి చెప్ప నెంతమాటనంటివి?

లవు-ఉ. ఆలమొనర్చి గాంచుము జయాపజయంబుల నొంటు లేనిచోఁ
గాలికొలందిఁ బర్విడుము కాలమెతప్పఁగ నేమి తప్పిఁకన్
బాలుఁడు బాలుఁడంచనకు బాలుఁడొ కన్నులవిప్పిచూడ నీ
పాలిటికాలుఁడో యితఁడు వ్యర్థపుఁబల్కులచేత నేమగున్

కుశ.—నీవుచచ్చిన మీయమ్మదుఃఖించునని యనికి వెనుకంజవేయకుము. రణముఖంబున జచ్చి వీరస్వర్గముంగన్న సుతునిమృతికి క్షత్రియమాతవిలపించునా? అంతకన్న వేఱేమికావలయును? కనుటయందులకేగదా!

భర-ఉ. వచ్చియు రానిపల్కులను బల్కెడుకూనలరౌట మీరెడన్
గచ్చె జనింప దేయ విశిఖంబులఁ జేతుల యాడ వందుచే
నిచ్చెవి గంటఁబెట్టుకొని యెంత వచించిన సార్థకంబులే
దిచ్చట నేమిచేయఁగల నింతకుఁగాలము మీకుమూఁడుటన్.

రామ—(లేచి తనలో) ఈబాలురు మాభరతునితోడ వాగ్వాదంబు సేయుచున్నారు. నేను సమీపించెదనుగాక. (డాసిప్రకాశముగా) బాలకులారా!

ఉ. ఎవ్వఁడుతండ్రి మీజననియెవ్వతె నామములెవ్వి నెమ్మితో
నివ్విలువిద్యలన్గఱపె నెవ్వఁడు కాఁపురమేడ నిట్లు మీ
రివ్వనభూమి గ్రుమ్మరఁగనేల తనూజుల మిమ్ముఁ బాపలన్
దవ్వులఁబాసి యెట్లుతలిదండ్రులు ధైర్యముఁజిక్కఁబట్టిరో.

కుశ—ఓరీవైరీ! వృథావాచాటా!

ఉ. మాటలతేట నేదొయొకమాడ్కిని మమ్ములమాయఁబుచ్చె దీ
వేటికి నింతమాత్రమున కేము ప్రసన్నులమౌచు నౌర యీ
ఘోటము నిత్తుమే జననగోత్రవిమర్శనమేల నీకుఁ బో
రాటము సేయవచ్చితివి రమ్మిటు వియ్యమునొందఁగాదునూ.

తమ్ముఁడా! లవా! సమదశాత్రవకాననదావానలా!

ఉ. వైరి యొకండు సోదరులభాగము లిద్దఱికెట్టులంచు నే
నారయుచుండ దైవగతి నన్ను తనంతట తానెవచ్చె నా

కార యదృష్టమేమి యనుజా యనుజాతునిఁ జంపు మగ్రజున్
బేరును జెప్పించంపెదను బెద్దయుఁ గన్నులపండు వయ్యెడిన్.

రాము—అనుజా! భరతా!

చ. కనుఁగొన వీరివేసములు క్ష్మాసురులోయనిపించు మాటలన్
వినిన నరేంద్రపాళి మఱపించు ధరామరసూనులైన నీ
యనుపమశౌర్యధైర్యము లనన్యశరీరవిలాసరీతు ల
బ్బునె తలఁకిందుగాఁ దప మపూర్వముగా నెపుడాచరించినన్.

కావున వీరు క్షత్రియకుమారులే. అయినను బాలురగుటచే వధ్యులుకారు. బుజ్జగించి చెప్పెదను. ఏవియయిన నభిలషించిన నిచ్చెదను. బాలురారా!

ఉ. కావలెనన్న వేలెతురగంబు లొసంగెద దంతులిత్తు భూ
షావళులిచ్చెద న్వలయునంతటివిత్తము నోడకిత్తు మ
జ్జీవసమానమై తనరుశ్రేష్ఠపదార్థములైన నిచ్చెదన్
గావున గుఱ్ఱము న్విడిచి కాదన కీరలు రండు వీటికిన్.

లవు—ఉ. దాతవుకావున న్వలయు దాని నొసంగెద విట్టియాగికిన్
జేతులుచాఁచుజోగి యిట సిగ్గిడి యెవ్వఁడు వాజివారణ
వ్రాతములీవెచూచితివె పట్టినపట్టుఁదొలంగమేము నీ
తాతనుడాసిచెప్పుకొను ధైర్యముగల్గిన రమ్ము పోరికిన్.

ఉ. పట్టుఁడు శూరులున్నఁ గ్రతువాజినటంచు లిఖించి పట్టముఁ
గట్టుటబద్ధమో రణముఖంబున శూరులమేముకామొ మ
మ్మెట్టులనైన గెల్చిగొనియేగుటయుక్తముకాదొ లంచమున్
బెట్టఁగనేల పౌరుషమె వింటెనిబూనినరాజకోటికిన్.

భర—(కోపముతో) ఓరోరిబాలురారా! బాలనాయకము సేయుచుంటిరా?

ఉ. ఎన్నిదురుక్తులన్న నను నేనవిలెక్కనుబెట్టనైతి మా
యన్న మహానుభావు సుగుణాఢ్యుఁ జతుర్దశలోకపూజ్యు మీ
రన్నదురుక్తి కేసయితునా యఱకాలను రాచివేయనా
మిన్నకయున్నకొద్ది మితిమీఱుచు నెత్తికినెక్కుచుంటిరే.

చ. సురలను మాటిమాటికిని సుక్కిక్క(గ(జేసినపఙ్క్తికంధరున్
దురమున గెల్చినట్టిఘనదోర్బలు(డీకరుణాబ్ధి కానవాం
తరమునిబాలురన్ గెడవ ధర్మముగాదన యూరకుంట మీ
రరసి మఱింతనవ్వులకు నల్లరి కిట్టు లుపక్రమింతురే.

లవు—ఓహో! రామాయణకథానాయకుండగు రాముండు కాబోలు? అటులయిన నితని పరితాపంబు మాకు( గొత్తదికాదు. ఓవనచరనుతనామా! రామా!

ఉ. పోరులు చేసిచేసి శ్రమపొందిన దాంతుని రాము గెల్చుటో
నారి యటంచు నెంచక ఘనంబని తాటక నేల(గూల్చుటో
సారములేక భూరుహముచాటున డా(గుచు( గో(తి( జంపుటో
యీరణవీరులన్ గెలుచు టేమనుకొంటివొ నోటిమాటలే.

కుశు—సోదరా! ఇతనిపరితాపంబులు పెక్కులుగలవు.

గీ. కుంభజన్ముండు పుడిసిటన్గ్రోలి విడిచి
నట్టియుదకంబునకు( గట్టగట్టె(గపుల
తోడుచేత నితండెట్టివా(డొ పైకి
మాత్ర ముత్తమచిహ్నలు మాయరేమొ?

భర—సోదరా! విరసులగువీరితో( బనియేమి? మనగుఱ్ఱంబును దీసికొనివెళ్ళుదము. (గుఱ్ఱమును డాయుచున్నా(డు)

కుశు—ప్రాణంబులందు నిరాశ(జేశికొని యేగుచుంటివా? నీవుకాదు మూడులోకముల వారేకీభవించినను గుఱ్ఱంబును విడిపించుకొనిపోవలేరు. (భరతునినడ్డగించుచున్నా(డు)

రాము—క. కులమా విఱికితోలికులమె
యలవా గనముక్కుపచ్చలారనె మాతో(
గలనా మీరల సేయం
గలరా యిదియేటివెఱ్ఱి కందువులారా.

ఈవెఱ్ఱిమాని గుఱ్ఱంబును విడిచిపెట్టు(డు. కుఱ్ఱలగుటచేత జాలిబొంది యింతగా నొక్క వక్కాణింపుచున్నారము.

లవు—అరులమగుమాపై నింతకనికరమేల? తొలగు(డు.

ఉ. కావుమటంచుఁ గాళ్ళఁ బడఁ గాచుట మీసముదువ్విరమ్మనన్
వేవురువచ్చిచుట్టినను వెంపరలాడుట క్షత్రియోచితం
బా విధి గాక యీ తెరువు నారయ మారయఁబోము పుట్టినా
లే విలుచేతఁబట్టి వసుధేశులకున్ దలవంపుగా నిసీ.

భర—ఓరోరీ! కన్నుతెలివనికూనలారా! మీసేమంబునుగోరి మే మెంత చెప్పినను వినకుం టిరి. మాయుపేక్ష నారసి యసమర్థతయని తలంపుచుంటిరా? చూడుఁడు. మే మిప్పుడు శాంతంబుగానున్నను సమరంబునకుఁ జొరఁబడిన సహస్రారుక్కలచందంబు న నుందుము.

కుశు—ఉ. చెప్పిరియెన్నియో చెవులుచిల్లులువోయెశుభంగిఁ బ్రజ్ఞలన్
గుప్పన నేలఁగూలి రొకకోలనె బూరుగచెట్టురీతి మీ
రప్పగిదిన్వచించి తుదకంతమునొందెద రెందుఁబోలికల్
తప్పనెయన్నదమ్ములకు దండుగొపండుగొ యొక్కటేయగున్.

లవు—అగ్రజా! ఆజి కాహ్వానించినను వీరుజాగుచేసెద రేల? క్షత్రియులు కారా? కరం బులయందు శరంబులను ధరింపరా? తమ్ములను గెడపినవారమగుటచే శత్రువులమని యెఱుంగరా? కారణంబేమి? (ఆలోచించి) అనుజవినాశసంజనితసంతాపాతిశయం బే. అంతకన్న వేఱులేదు. ఓభూపాలాభిధానులారా!

చ. కడుపెంౘుశోకభారమునఁ గ్రాగెడువారము గాన వీరితోఁ
దొడిబడిపోరుసేయుటెటో తోఁపదటంచు భయంబు గన్నచో
నుడివెదనొక్కవాక్యము వినుం డిఁక నీసవనంబుపేరు దే
వుఁడెఱుఁగుఁ గాని ప్రాణములఁబోకడపెట్టక యింటికేగుఁడీ.

కుశు—తమ్ముఁడా! దయార్ద్రహృదయుండవై యిట్లుపలికితివి కాని వీరు.

చ. మనలనుగెల్చి యాగము క్రమంబుగఁజేసెద రట్లుకానిచో
మనపరమాస్త్రశస్త్రముల క్రమ్మంౘెద రంతియుగాక యుద్ధభూ
మినివిశ్రుఁ బంద లే జసులె మీసముఁగాంచనివారె లజ్జకం
టె నుసురుతీపియెక్కువె గణింపరె కీర్త్యపకీర్తులింతయున్.

నాతీవ్రబాణపరంపరల కోర్వఁజాలక శరణుఁజొచ్చినసరే. అట్లు శరణుశరణనక.

ఉ. గ్లానిని నొక్కవేళ బ్రతుకన్ దలపోయుచు మాయవేషముల్
పూనిన నిందఁ జాలము నపూర్వముగాఁ గనిపింపఁజేసినన్
బ్రాణముతోడ నేవిడుచువాఁడనె చచ్చిన నింక నొక్క మా
త్రైనను జంపకుండుదునె యంతటివెఱ్ఱినె కోపముండదే.

రామ—భరతా! వీరు గురువులయాజ్ఞలో మెలంగినట్టులేదు. దానిచే వాగ్ధోరణి కడ్డు లేకున్నది. ఇంక నుపేక్షించుట యుచితంబుగాదు. డింభకులారా!

గీ. భానుకులుఁడౌ దశరథాత్మభవుఁడనేని
నేకపత్నీవ్రతంబు నేనేదనేని
నాకుమారకు లీరైన నాదుశరము
విడక వజ్రప్రహారమై వెలయుఁగాత.
(బాణము విడువఁగ వజ్రహారమగును)

ఏమిదియాశ్చర్యము?

భర—ఆశ్చర్య మేమియున్నది? తమరన్న మాట తప్పునా?

రామ—ఏమంటిని?

భర—గీ. భానుకులుఁడౌ దశరథాత్మభవుఁడనేని
నేకపత్నీవ్రతంబు నేనేదనేని
నాకుమారకు లీరైన నాదుశరము
విడక వజ్రప్రహారమై వెలయుఁగాత.

అని నుడివితిరి. దివ్యశరసంధానచాతుర్యంబుచేతను దోర్బలధైర్యశౌర్యవీర్యంబుల చేతను మిమ్ములను బోలియున్నారు. చారువదనవిలాసాదులచేతను శిరీషకుసుమపేశలశరీరసౌకుమార్యంబులచేతను మావదినెగారిని బోలియున్నారు. నిక్కవంబుగా వీరు మీ కుమారకులే.

వసి, వాల్మీ—(ప్రవేశించి) సత్యము సత్యము సత్యము.

రామ—మాభరతునిమాటలకు వసిష్ఠ వాల్మీకులే సత్యమ్మని సాక్ష్యమిచ్చుచున్నారు. నాభాగ్యమేమి! మునీంద్రులారా! వందనంబులు. (నమస్కరించుచున్నాఁడు)

వసి, వాల్మీ—శుభంబుకలుగుఁగాక.

కుశ, లవు—(తమలో) ఎంత తప్పొనరించితిమి? విద్యల నేర్పుట గురువుల నెదిరించుటకా? ఈయపచారంబునకుఁ బ్రాయశ్చిత్తంబుకలదా? (విచారించి) తెలియనియప్పుడు చేసినదేమి? తాపసోత్తములారా! వదనంబులు. తండ్రులారా! నమస్కృతులు.

(నమస్కరించుచున్నారు)

రాము, భర—జయముకలుగుఁగాత.

కుశు—చ. ఘనమగుమీమహత్త్వమును గాంచఁగ నేరక మందబుద్ధి మా
జనకుఁడవంచు నే మెఱుఁగఁజాలక తప్పొనరించినా మయో
తనయులు చేయుతప్పులను దండ్రులు సైఁతురు గాన సైఁచి మా
జననినిజూచియైన మముసాఁకుము తప్పునుగాంచుమొప్పుగాన్.

లవు—ఉ. అయ్యవొకావొ మేమెఱుఁగమైతిమి యయ్యవటంచు నెమ్మిఁ దా
తయ్య వచింప నమ్మితిమి యాజిముఖంబునఁ బూజ్యులైన పి
న్నయ్యలఁ దూలనాడితిమి యజ్ఞతవానిని నెల్లసైఁచి మా
యయ్యవుకమ్మ కేవలదయారసదృష్టిని మమ్ముఁబ్రోవుమా.

కుశు—ఉ. అమ్మనుజేరి మాజనకు నర్మిలినిప్పుడ చూపుమంచు ని
త్యమ్మును బోరి మేమడుగ నత్తఱి కత్తఱి రేపు మాప టం
చిమ్మెయి గడ్పుచుండె నిఁక నేమును దండ్రినిజూచునంత భా
గ్యమ్ము నోఁచమైతిమని యాశనువీడితి మంతకంతకున్.

లవు—ఉ. అట్టులనుండ మాఫలములన్నియుఁ బండినవోయనంగ మీ
రిట్టుల వచ్చినారు కృతకృత్యులమైతిమి జన్మమెల్ల ని
ప్పట్టునఁ బూతమైపరఁగె బంగరుఁగొండను మెట్టినాము మి
మ్మట్టితి మేముచేసినదె పుణ్యము మావలెఁ జేయ రెవ్వరున్.

రాము—ధన్యుండను ధన్యుండను.

వసి—విశ్వామిత్రసత్రసంరక్షణార్థంబయి కాకపక్షంబులంగలిగిన రాజీవాక్షుని నిన్ను నిశాచరులమీఁదికి నీజనకుండెట్లంపెనుకొంటి భవత్సాహాయ్యంబున సవనదీక్షు పరిసమాప్తినొందినపిదప నీయనుపమవిక్రమంబునను నాశ్చర్యంబునొందితి. ఆయాశ్చర్యంబునకన్న నీపుత్త్రులశౌర్యాటోపంబులఁ జూడ మిఁఱుచున్నవి. శూరులగు పుత్త్రులను

కుశు—పినతండ్రులారా! నమస్కారములు.

ఉ. దాసునితప్పులన్నియును దండముతోసరియంచు మే మిదే
చేసితిమయ్య దండములు చేసెదమింకొకసారిక్రమ్మఱన్
భాసురకీర్తులార రవివంశపయోదధిచంద్రులార మా
దోసపుఁదీవెగుంపులను ద్రుంపుఁడు పూనిదయాలవిత్రమున్.

లవు—పితృవ్యులారా! తప్పుమన్నింపుఁడు.

లక్ష్మ—తండ్రులారా! మీతప్పేమియున్నది?

ఉ. అచ్చునగుద్దినట్లు జనకాత్మజపోలికలీరు మోమునం
దచ్చటనచ్చటన్ గనుట నామెకుమారకులంచు నాత్మలో
నచ్చియు నామె మిమ్ముఁగనెనా కనిన న్విలువిద్య లెట్టుల
న్వచ్చెనటంచు సంశయమునన్ బడిపోయితి మోసపోయితిన్.

శత్రు—చ. అనిమొన మిమ్ముల న్గనిన నక్కలువేవురుదోఁచినట్లు దోఁ
ప నపుడె రామపుత్త్రులని భావమునన్ దలపోసి యంతలోఁ
గనులనుమూసినట్లు ననుగాఢతమంబగుమాయ గప్ప హ
మ్మనియదలించి పైఁబడితి నర్హముకానివిధంబుఁజేసితిన్.

భర— మ. ధనువున్ బట్టుట కోలలన్ విడుచుటన్ ధైర్యంబుతో నుండుటన్
గని మాయగ్రజుతోడఁ బుత్త్రులని పల్కంబోయి యుక్తంబుగా
దని సాల్కన్ బిగబట్టితిన్ బిదప నేమైనన్ సరేయంచు నే
నవనైతిన్ గనులారగాంచియును గార్యంబున్ వృథాచేసితిన్.

లవు— ఉ. పోరులటంచుఁగొంత పసిపాపలటంచును గొంత సత్కృప
న్నీరు వహింపకున్న జననీముఖవైఖరిఁ గాంచకున్న మే
మీరణమందునన్ గెలుతుమే గెలుపట్టులనుండనిందు మీ
తీరున నుందఱి న్నిలిచి తేఱికనుంగొన నైననేర్తుమే.

కుశు- చ. దురమను పేరునన్ శిశులదోర్బలమున్ గనువాంఛచేత సు
స్థిరజయలక్ష్మి నిచ్చుదయచే దయచేసినయట్టిమీకు స
త్కరుణ ఘనంబుగాఁగలదు గావున మాయెడ లేనిశక్తు ల
బ్బురముగఁజూపనెంచెదరు పోల శతాంశము నైనఁగంటిమే.

లవు—ఒకవేళనున్నను.

చ. తనయులకెల్ల విద్యల నుదారమనంబున నేర్పనోజ్జ లేఁ
డని వగఁజెందు మాజనని నారసి యేద్వయు మేనుగల్గ నీ
కు నొకకొంతయున్నె పసికుఱ్ఱలవిద్యలభారమంత నా
దని తనపైనఁబెట్టుకొని యట్లొనరించిన తాతకే తగున్.

రాము—తాపసోత్తమా!

సీ. రామాయణంబును రచియించి నాపేరు గణనకెక్కించినఘనుఁడవీవె
కానలో విడిచినకాంతపైఁ గృపఁబూని యన్నాళ్ళుసాఁకినయన్న వీవె
చంటివాండ్రకు నెల్లశస్త్రాస్త్రవిద్యలఁ గూర్మితోఁ గఱపినగురుఁడవీవె
మేదినిఁబడినసుమిత్రాత్మభవులకున్ బ్రాణముల్ వోసినబ్రహ్మ వీవె
ఆ. వె. ఆపదబ్ధినీఁదులాడుమమ్మీక్షించి
కరుణఁదేల్చినట్టికలమ వీవె
నీకుఁ బ్రత్యుపకృతి నేఁజేయఁజాల న
మఃపదంబుదక్క మౌనివర్య.

వాల్మీ—అందఱికిఁ జేరుగడయైన నీవె నన్ను గోరంతపనికిఁ గొండంతగాఁ బొగడ నేల?

రాము—(పుత్త్రులనుదగ్గఱకుఁదీసి) తనయులారా! భువనవిఖ్యాతనయులారా

సీ. తనయుండు కల్గినాఁడనువార్త వినిపించు వాఁడభీష్టంబును వడయు టెపుడో
పాఁకులాడుచువచ్చి పైకిఁజేతులుచాఁచు పుత్త్రునెత్తుకొనెడుపుణ్య మెపుడో
పుడమిపైఁ బొరలాడు బుడుతనంకముమీఁద నిడుకొనిముద్దాడుగడియ యెపుడో
పులకండమించి పీనులపండువగునాను భాషణంబుల వినుభాగ్య మెపుడో